# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. నా చిన్ననాటి ముచ్చటలు : డాక్టరు కే. యన్. కేసరిగారు | | రు. 2.00 |
| 2. వేప (వైద్యగ్రంథము) : | ,, | రు. 0.75 |
| 3. బిల్వ ( ,, ) | ,, | రు. 0.75 |
| 4. అరవింద(నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | | రు. 1.00 |
| 5. శ్రీ జ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు | | రు. 0.37 |
| 6. ఫిలోమినా తంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | | రు. 0.75 |

## మా దగ్గర లభించు యితర గ్రంథములు

| | |
|---|---|
| దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు | రు. 12.50 |
| సరళా ప్రభాకరము (హిందూగృహము) : శ్రీమతి కా. చంద్రమతిగారు | రు. 1.25 |

గ్రంథాలయములకు, ప్రజాహిత సంస్థలకు ధరలు తగ్గించబడును

## 'గృహలక్ష్మి'

## స్త్రీల మాసపత్రిక

28 సంవత్సరములనుండి మహిళాభ్యుదయానికి, అచంచలమైన కృషిచేయుచున్న స్త్రీల సచిత్రమాసపత్రిక, త్రివర్ణ చిత్రాలతోటి, విజ్ఞాన వికాసాలను పెంపొందించే వ్యాసాలతోటి, యింకా నాటికలు, కథలు, బాలవినోదంతోటి ప్రతినెల 15-వ తేది వెలువడుచున్నది. విడిప్రతి 40 న. పైసలు

హిగిన్‌బాదమ్సు స్టాల్సులో దొరకును

ఏజంట్లులేని ప్రదేశములలో ఏజంట్లు కావలెను

అడ్వర్టైజుమెంటు కాన్వాసు చేయువారికి మంచి కమీషను సదుపాయములు లభించును

గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

# అపారమైన శక్తియుత్సాహములే మీ ప్రతిష్ఠను కాపాడగలవు

# అమృత

## మధురమైన పానీయము



వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నిచ్చే ముఖ్యసాధనం అమృత. ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కలిగిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాంటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧] ఏప్రెల్ 1959 [సంచిక ౪

# వి ష య సూ చి క

—(०)—

ముఖచిత్రము :

ప్రసిద్ధ సినిమానటి నళిని జయ్వంత్



జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# మతము — సంఘసేవ

మానవ జీవయాత్రకు సంఘజీవనము అనివార్యమైనది. సాంఘిక జీవనంలో పరస్పర సన్నిహిత సంబంధము, సద్భావము, సానుభూతి, సేవాత్యాగములు లేనిదే వ్యక్తుల జీవితమునకు సౌభాగ్యముకాని, శాంతి భద్రతలుకాని యుండవు. సౌభాగ్యవంతమైన సంఘజీవనము నుద్దేశించియే మతములు ఏర్పడినవి. మానవ జీవయాత్రను క్రమబద్ధంచేసి స్వీయ సౌభాగ్యముతో బాటు విశాల దృక్పథంతో ప్రపంచ సౌభాగ్యమును సయితము తీర్చిదిద్దుట కనువుగానే మతములు రూపొందినవి. ఇహపరములు రెంటిలోను మానవ జీవితము ఉత్తమోత్తమమై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారమును సాధించుట యనగా ప్రతి జీవరాసిలోను, ప్రకృతి సృష్టిలోను భగవంతుని - మంచిని గుర్తించుట. అనగా తను నైతిక, ఆధ్యాత్మికస్థాయిలో ఉత్తమస్థానము నాక్రమించుట. ఇది ప్రేమ, సేవ, త్యాగములవల్లనే సాధ్యము. దీనినే ప్రతియొక్క మతము ప్రబోధించునది. అట్టి మతంలో సంఘసేవ ఒక భాగమనుటలో విశేషము ఏమిలేదు.

ఏమతమువారైనా ప్రేమ, సేవాసక్తి, విశాల దృక్పథము లేనిదే తమ కొఱ

మతమున్నదని యపోహపడుట పొరబాటు. బూటకపు ఆవేశము, ఉన్మాదము తనకు యిహాపరాలలో నుపయోగపడకపోగా సంఘశ్రేయస్సుకు, సౌభాగ్యమునకు తోడ్పడజాలవు. సంఘసేవ ఆత్మార్పణంతో జరుగవలసిందికాని, సంకుచిత తత్వముతోటి, పరిమితులు, హద్దులతో చేయవలసినదికాదు. మత లక్ష్యాలు విశాలమైనవంటే సంఘసేవకు అవకాశములు మెరుగై మానవజీవితానికి సుఖసౌభాగ్యములు విస్తృతం కాగలవు.

# ప్రాథమిక పాఠశాలలో ప్రవేశానికి వయోపరిమితి

ప్రైవేటుగా చదువు చెప్పించి ప్రాథమిక పాఠశాలలో చేర్పించుటను నిరసిస్తూ అలాటి ప్రవేశం బాలబాలికల కనీస వయోపరిమితికి భిన్నముగా నుండుట వాంఛనీయముకాదని కేరళ ప్రభుత్వము నిర్దేశించింది.

ప్రాథమిక పాఠశాలలు సమర్థంగా బాలబాలికలకు విద్యగరపే పరిస్థితులలో ప్రైవేటుగా తల్లిదండ్రులు బిడ్డలకు చదువు చెప్పించుకోవలసిన అవసరముండదు. హోదాకని సంపన్నులు ప్రాకులాడినా సామాన్య కుటుంబీకులకు ప్రైవేటు ట్యూషన్ చెప్పించుట భారమనే చెప్పాలి.

అనివార్య పరిస్థితులలో - అనారోగ్యంవలననో, మరే కారణాలవల్లనో తను బిడ్డలకు సకాలంలో విద్యాభ్యాసము చేయించి ప్రాథమిక విద్యా వసతులు కల్పించలేని పరిస్థితులలో వయస్సుకు తగిన విద్యా ప్రమాణమునకు ప్రైవేటు ట్యూషన్ అత్యవసరమనే చెప్పాలి. ప్రాథమిక పాఠశాలలో ప్రవేశానికి 6 సంవత్సరముల వయస్సు అనువైనది అయినా, అయిదవ సంవత్సరమునుండి బాల బాలికలను విద్యా విజ్ఞానముల వాతావరణంలో పెంచుతూ వారికి సుశిక్షణ, విద్యపట్ల ఆసక్తిని పెంపుచేయాలి.

ప్రైవేటు ట్యూషన్ బాల బాలికలకు విద్యాభ్యాసమునకు తోడ్పడుతూ, తోడి బాలబాలికలతోబాటు సమస్థాయిలోనో, మిన్నగానో రాణించుటకు తోడ్పడుట ప్రోత్సహించ తగినదనే చెప్పాలి.

# పరిణామము

## శ్రీ గాడేపల్లి శంకరం

(గతసంచిక తరువాయి)

### పంచమాంకము :

ఒకటవ రంగము

ప్రదేశం : జమీందారుగారి భవనం (కచ్చేరి సావిడి)

ప్రవేశం : జమీందారుకొడుకు (పేపరు చదివి ముగించి ఇటూ అటూ పచారు చేస్తూ–)

జ.కొ:– శెట్టిని వెంటనే రమ్మని కబురు చేయించాను– ఇంకా వచ్చాడుకాదు - ఇవాళ సంతరోజా - ఇవ్వాళైనా వస్తాడోరాడో - వాళ్ళ పనులున్నప్పుడు మాత్రం వంగి వంగి సలాములు చేస్తూ వాకిట్లో పడికాపులుపడి కూర్చుంటారు - మన అవసరంవుండి పిలిపించామని తెలిసిందా – మన గుమ్మం తొక్కి చూడరు సరికదా – ఎక్కడలేని పనులు వాళ్ళకు అప్పుడే వచ్చిపడతాయి – మన మంచినీ మర్యాదనీకూడా మరిచిపోతారు–

సెట్టి:–(ప్రవేశించి) ప్రభువులు క్షమించాలి.

జ.కొ:– ఇదిగో సెట్టీ ! ఇప్పుడే నీ మాట అనుకుంటున్నాను – ఇంకా వచ్చావు కాదేమా అని !

సెట్టి:– తమలాంటి ప్రభువులు కబురంపితే రాకపోవడం ఉంటదా బాబూ – కాని పనులు వచ్చిపడ్డంచేత – కాస్త ఆలస్యమైందిగానీండి –

జ.కొ:– దానికేమిలే – మాడుసెట్టీ నీతో ఒక గొప్ప సంగతిని గురించి ఆలోచిద్దామని వెంటనే రమ్మని కబురు చేయించాను.

సెట్టి:– చిత్తం – అనుకుంటూనే వున్నానండి–ఇదేదో మహా గొప్ప విశేషం అయివుంటదని – తమలాంటి గొప్పోరితో గొప్ప సంగతులుంటాయిగాని – కొద్ది సంగతులుంటాయండి మరీ – ధాన్యం కట్టుబడి రోజులు బాబూ, దగ్గరవుండి చూసుకోపోతే – ధరలు గిట్టుబాటు కావండి – వెంటనే దర్శనం చేసుకోలేకపోయాననగదా అని యెంత విచారంగా వుందనుకున్నారు ?

జ.కొ:– ఫర్వాలేదులే ! చూడూ, మొదటినుంచీ నీవు మాకు ఆంతరంగిక మిత్రుడవు –

సెట్టి:– చిత్తం చిత్తం ! అలాగేనండి మరి – ఎంత కాలంనుంచో – మనకీ మనకీ యేకయిస్వాసంతో రోజులు ఎల్లిపోతావున్నాయి – సంగతేటో సెలవియ్యండి బాబూ !

జ.కొ:– నిన్ను చూస్తే – నాకు మహా ఆనందంగా ఉంటుందయ్యా సెట్టీ – ఏమంటావా–నీకు మన గ్రామాల్లో ఉన్న మర్యాద–ప్రజల్లోగల పలుకుబడి - నీవు వాళ్ళకు చేస్తున్న సేవా – అంతా గమనిస్తూనే వున్నాను – పరోపకారార్థమిదం శరీరమనే బాపతు మనిషిలా కనబడుతావు –

సెట్టి:– హిహి దానికేమిలెండి - నా మీద తమకున్న అభిమానం అట్టాంటిది కాబట్టి - తమరల్లా సెలవిస్తున్నారేగాని - తమలాంటివారిముందు మేమెంతండి బాబూ–

జ.కొ:– అది కాదులే - మన గ్రామాల్లోగల బీద రైతులందరికీ – అవసరానికి పదీపాతికా బదుళ్ళు యిచ్చి వాళ్ళ పంటలు కాపాడుతావనీ–వాళ్ళనో కంట కనిపెడుతూ వుంటావనీ విన్నాము –

సెట్టి:– చిత్తం - నాకనిపెట్టడం ఎంతలెండి ! ప్రభువుల గొప్ప పల్లెగ్రామాల్లోయినాలి - మనవి సెయ్యాలంటే మనిషికున్న నాలిక సాలదనుకోండీ !

జ.కొ:– అవును పాపం – ప్రజలకి నాయందుగల గౌరవ ప్రపత్తులు గమనిస్తూనే వున్నాను .

సెట్టి:– తమరికి – మావంటి పల్లెవాసులమీదున్నా దయావాచ్చిన్యాలమాట అలాగుంచండి ! అదో లెక్కలోకేరాదూ - ప్రభువులకున్నా భూతదయ – ప్రపంచంలో యెవరికేనా వుంటదా అని మా సందేహం - మాటొచ్చింది కనుక మహరాజు గొప్ప మనవిచేస్తున్నాను - అసలు మాకు

తమరి గొప్ప చెప్పుకోని రోజే వుండదనుకోండి - ఓపాలి రాములోరి గుడి దగ్గర రావిచెట్టుకింద అంతా కూర్చున్నాం - కసాయోడి కత్తినుండి పశువుల కాపాడుతామనీ - గోరక్షణశాలకి రైతులంతా గొప్పగా సహాయపడాలనీ - వూరూరా సందాలు దండుకుంటూ - మనవూరూ వచ్చారండి బాబూ - ఆళ్లతో మావోడన్నమాట తమరు చిత్తగించాలి - నాయనమ్మల్లారా మహా గొప్ప నాయకులు ఈ యేళ మీరు బయల్దేరారూ- ఒక్కసారి మా గ్రామ ప్రభువుని కళ్ళుంటే యెల్లి మాసిరండీ - ఒక్క గోవుల్నే కాదు ఆరు కాపాడుతావున్నదీ - గుర్రాలూ, యేనుగులూ - లేళ్లూ లొట్టిపిట్టలూ - ఓహ్ ఒకటేటీ - ఇంకా కావలిస్తే - కుక్కలు నక్కలు పందులు కోళ్ళు మొదలైన నానాజంతు సంరక్షణశాలే నడిపేస్తున్నారయ్యా - ఆరికున్నా భూతదయకన్నా మీకెక్కువుందా అని మన గొప్ప మహా బాగా మనవిచేశాడు బాబయ్యా !

జ.కొ:- అవునులే - చూడూ - మన పల్లె ప్రజలు పట్టి అమాయకులు సుమా ! అధోగతిలో ఉన్న వీళ్ళని ఆకాశాని కెత్తట మెలాగా అని ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటాను.

సెట్టి:- బాబూ ! దేనికైనా సమయం రావాలి గదాండీ ! సంగతేటో సెలవిప్పించారు కాదు.

జ.కొ:- సెట్టీ - నీ వంటి పెద్దమనిషి సహకరిస్తే - నేను కన్న కలలు తప్పకుండా నిజమవుతాయి మరి -

సెట్టి:- బాబూ ! ఒక్క మనవి చిత్తగించాలి. పుట్టిన కాడనుంచీ - పొగిడించుకోవడమంటే మహా కష్టమండి నాకు - తమకు తెలుసునో తెలియదో గాని -

జ.కొ:- అది నాకు తెలుసునోయి సెట్టీ - నా మాటకు యెప్పుడూ ఎదురుచెప్పేవాడవు కాదనీ నాకు తెలుసు !

సెట్టి:- మరిక - సంగతేటో సెలవిప్పించండి.

జ.కొ:- రేపువచ్చేమాసంలో - శాసన సభలకి ఎలక్షనులు జరుగుతాయి - తెలుసా-

సెట్టి:- అయ్యో బాబూ ! తెలవకపోవడమేటండి ! ఈ కాంగ్రెసోళ్ళు ఎక్కడచూసినా - ఆ గోలే కాదండీ యెడతావున్నారూ ?

జ.కొ:- అవును. ఈ సారి కాంగ్రెస్సుకూడా శాసన సభలకి కంటెస్టు చేస్తోంది- మన ఫిర్కాకి మనమే నిలబడితే - ఎలాగుంటుందంటావు ?

సెట్టి:- ఓల్ రైటుగా వుంటదండి- ప్రభువులు ప్రజా సేవకుల మవుతామంటే అడ్డుందా బాబూ ! తమలాంటివారు కాంగ్రెస్సులో చేరి - ప్రజాసేవ చేస్తే - ఇక చెప్పేదేముందండీ - ఆ గాంధీ బాబు చెప్పినట్టు మన ఇంటినీ వంటినీ సుబ్బరం చేసుకొని - మన పల్లెనీ ప్రజల్నీ బాగు చేయాలన్నాడు. తమకున్నా సుగుణాలకి - ఎప్పుడో ఒకప్పుడు ఇటువంటి బుద్ధి పుడతదని - అనుకుంటూనే వున్నానండి.

జ.కొ:- అది కాదు సెట్టీ ! ఏ నాడూ - ఏ పార్టీకి చెందని మనం - ఈ నాడు - కాంగ్రెస్సు తరఫున నిలబడటం- అంత భావ్యంగా లేదు - ఎందు చేతనంటావా - అది మహా సంస్థ - మహాత్ముని ఆదేశాను వర్తులకే అందులో అవకాశం ఉంటుంది కాని- తదితరులకు తావుండకపోవచ్చు- పైగా బ్రిటిషు వారిమీద బహిరంగంగా కాంగ్రెసు వారివలె కత్తికట్టగలమూ ? అయినా మనం స్వతంత్రంగా ఎందుకు నిలబడకూడదూ ? మన గ్రామ ప్రజలకు మనయందు భక్తి విశ్వాసాలున్నపుడు - మన గ్రామాలను మనం యేలుకోటంలోనూ - మన గ్రామ ప్రజలను మనమే బాగు చేసుకోటంలోనూ - తప్పేమీ లేదుగదా !

సెట్టి:- ఒక్క నాటికి లేదు - ఎవడేనా ఇది తప్పని - ఏనోటితో అనగలడండీ ! గుండా ! చెరువా ! తమరి అభిప్రాయం ఎల్లాగుందో - అల్లాగే కానీయండి బాబూ !

జ.కొ:- దీనికి అడ్డేముందీ ?

సెట్టి:- ఒక్క నాటికుండదు - ఎందుకుంటుదండీ !

జ.కొ:- మన గ్రామాలమీద అధికారం మనకే వుండాలిగాని - మరొకరికి ఉండటం మంచిదంటావా ?

సెట్టి:- అనను బాబూ అనను- ఎంతమాట ! గ్రామాల మీద మనకున్న అధికారం గాంధీబాబుల కట్టావస్తదండీ ! ఆరి కెలా యిడిసిపెట్టగలం ?

జ.కొ:- వాళ్ళ ఆశయాలు - మన ఆశయాలు ఒకటే అయినప్పుడు - ప్రత్యేకించి అందులోచేరి పని

చెయ్యాలా – మరో పార్టీ పేరుతో ప్రజాసేవ చేయకూడదూ ?

జ.కో:–చూడు - అల్లాగయితే రేపటి ఎలెక్షన్లలో శాసనసభా సభ్యత్వానికి నేను పోటీచేయటానికే నిశ్చయించాను – మన గ్రామాలలోగల రైతులు. మీ షాహుకార్లూ - అంతా కూడా నన్నే బల పరచేటట్టు – నీవు ప్రచారం చేయాలి తెలి సిందా !

సెట్టి:–అయ్యో బాబు - ప్రభువులు తలంచుకున్న పనికి ప్రకారాలతో నిమిత్తంలేదండి – మన గ్రామాల్లో మనకి ప్రకారాలేటండీ - ఒక్కపాలి తమ రిట్టా నిలుచుంటున్నారని తెల్చేసరికి ఏక దమ్మని ఎర్రిగాపడిపోవుటండీ ఓట్లు !

జ.కో:–అందుకే మరి – నీవు మనవాళ్లనందర్నీ కూడ గట్టుకొని మనమాట వాళ్ళందరికీ తెలియజెప్పు - దీనికి ప్రతి ఫలం ఉండకపోదు సుమా ?

సెట్టి:"అయ్యో మా రాజా - నాకు తెలవదుటండీ. మహా రాజులతో యెవ్వారం మరోలాగుంటుందా! ఇక మరి నాకు సెలవిప్పించండి - సంతలోకి సరు కట్టుకొచ్చాను కూడాను –

జ.కో:–ఊ. సరే నీవు వెళ్లు–ఎప్పటికప్పుడు నాకు వార్తలు తెలియచేస్తూవుండు సుమా !

సెట్టి:–చిత్తం. చిత్తం - మద్రాసుకేనా ?

జ.కో:–మరే – చిత్తం సెలవు.

(తెర)

(సశేషము)

—— (o) ——

శ్రీ సాయిభక్త సమాజము మద్రాసులో షెనాయ్ నగరమందు 'సాయినిలయం' కార్యస్థానముగా ఏర్పడినది. రిటైర్డ్ జిల్లాజడ్జి శ్రీ యం. రామానుజాచారిగారు అధ్యక్షులుగాను, శ్రీ టి. పురుషోత్తం M. L. C., సి. నటేశన్, గుంటూరు నరసింహారావుగారలు ఉపాధ్యక్షులుగాను, శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు కార్యదర్శిగాను, శ్రీ యస్. కే. సుందరరాజ్ కోశాధి కారిగా పరిపాలకవర్గంతో సమాజం రిజిష్టరు చేయబడింది.

చాలకాలంగా స్వామికేశవయ్యజీ 'సాయినిలయం'లో నిర్వహిస్తున్న పూజ, ఆరాధనలు, సేవా కార్యక్రమములను శాశ్వతకాలం నిర్వహించబడుటకుగాను యీసమాజం ఏర్పడింది. ఈ సమాజపు సభ్యత్వరుసుము నెలకు 50 నయాపైసాలు. కులమతవర్గ విచక్షణారహితంగా భక్తులు సభ్యులుగా చేర వచ్చును.

శ్రీ సాయిబాబా ఆరాధనా కార్యక్రమాలకుగాను సాయినిలయం ఎదుటనే ఒకమందిరం నిర్మిం చుటకుద్దేశించబడింది. మందిర నిర్మాణమునకు విరాళములిచ్చి తోడ్పడదలచిన వారు కోశాధికారి శ్రీ యస్. కే. సుందరరాజ్, బ్యాంక్ అఫ్ మైసూరు మేనేజరు, మద్రాసు I. కు పంపవచ్చును. భక్తుల శ్రద్ధా భక్తులతోకూడిన సహాయ సహకారములతో శ్రీ సాయిమందిర నిర్మాణము జరుగగలదని ఆశిస్తున్నాము.

సంపాదకుడు

♦ ♦ ♦

మన దేశంలోని పశుసంపద యితరప్రపంచ ప్రాంతాలలోకంటె అధ్వాన ముగానున్నదానికి మన దారిద్ర్యమని చెప్పలేము. మన నిర్లక్ష్యమే మన పశుసంపద అసంతృప్తికరమైన స్థితిలోనుండడానికి కారణము.

# ఉగాది కానుక

## శ్రీ వికారి

(కవిభూషణ, శ్రీ కల్లూరు అహోబలరావు)

పండుగ నేడుగాది, పరిపాటిగ భామినులెల్ల. నిండు పూ
దండలు గ్రొత్త పుట్టములు దాల్చి, సుభూషణముల్ ధరింత్రు; నీ
వండజ యాన! శ్రీకరము - హాస మనోహర వేష భూషలన్
నిండుగఁదాల్చి రమ్ము; తరుణీ! వలదమ్ము - వికార వేషముల్.

హృదయానందకరీ! సౌ
ఖ్యదరీ! నారీ! ఒయారి! కడు శృంగారీ!
ముద మొసఁగెదు, సంసారీ!
ఇదె మా స్వాగతము! స్వీకరింపు; వికారీ!

కల రుతములు బలికెను, కో
యిలగమి, మలయానిలంబు లింపుగ వీచెన్
లలి సుమములు వర్షించెను
కోలు వింపారంగఁజేసి కొమ్ము; వికారీ!

రాజుగా గురువుంటఁ బ్రజలు సుభిక్షచే
నారోగ్య సుఖముల ననుభవింత్రు
సేనాధిపతి, శశిగానఁ రోగరహితు
లై యుంద్రు; ప్రజలెల్ల హాయిఁబొంది
అర్ఘాధిపతియు, మేఘాధిపతియుఁ జంద్ర
ముఁడు గాన, బాహుళ్యముగ ఫలించు
పశుపాలకుండు, గోపాల బాలుఁడు గాన
గోగణ మమృతంబు గుఱియుచుండు

మంత్రి కుజుఁడు గాని - తంత్రంబు సెల్లదు
రాజ్యమందు గురువు - రాజుగాన
ఓ వికారి! వలవ దేవికారము, మమ
కార మూనుచు, నుపకారి వగుమ!

జిలిబిలి పల్కులన్ తెలుఁగు జిన్నెలు వన్నెలు జిందులాడ, కో
కిలకల నాదముల్ వెలయఁ గిన్నెర సానులు నట్టువాడఁగాఁ
గలకలఁ దెల్గు కబ్బములు, కమ్మగ వ్రాయఁ గవీంద్రకోటి, మే
ల్కొలుపుము శ్రీ వికారి! కయికొమ్ము! జోహారు లుగాది కానుకల్

శ్రీ సాయిబాబా భక్త సమాజం (రిజిష్టర్డ్)

# శ్రీ రామనవమి మహోత్సవ సందేశము

మూలం :
శ్రీ స్వామి కేశవయ్యాజీ



అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య

శ్రీ మద్భగవద్గీతలో శ్రీ కృష్ణపరమాత్ముడు ధర్మము నశించి, అధర్మము, అక్రమము వృద్ధిదశలో నున్నపుడు తాను మంచిని రక్షించి ప్రోత్సహించుటకు, దుర్మార్గమును నశింపుచేసి ధర్మసంస్థాపనము చేయుటకు ప్రతి యుగములోను తాను ప్రత్యక్షమగుచుందునని చెప్పెను. శ్రీరామచంద్రుడు అట్టి త్రేతాయుగపు అవతార పురుషుడు. ఆయన మహోజ్వలమైన సత్యస్వరూపుడు. ఆయన జీవితచరిత్ర యుగయుగాలలోను పవిత్రమైన, పరిశుద్ధమైన, స్వార్థరహితమైన జీవయాత్రకు ఆదర్శనీయమైనది. ఆ ధర్మస్వరూపుడు, ప్రేమమూర్తి, త్యాగమూర్తి, జన్మదినమగుటచే యీ రోజు మహా పుణ్యదినము. రామనామము తారకమంత్రము. అత్యంత శ్రద్ధాభక్తులతో యీ పవిత్ర నామమును స్మరించుటవలన మానవుని సమస్త మానసిక, శారీరక బాధలు స్వస్తత చెందును; శాశ్వతమైన శాంతి సమకూరును. రామాయణము అమూల్యమైన సిరిసంపదలుగలనిధి. రామాయణ పారాయణము ప్రాపంచిక సుఖసౌభాగ్యములనేకాక ఆధ్యాత్మికంగా శాశ్వత కైవల్యపదవిని సయితము సిద్ధింపచేయును.

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే

ఈ మహా మంత్రములో హరి, రామ, కృష్ణ – మూడు పవిత్రనామములుకలవు. హరి యనగాయోగుల హృదయములను హరించి దుర్మార్గులయొక్క పాపములను సయితము హరింపజేయువాడు. రామ యనగా యోగులను రంజింపజేయు పరిపూర్ణ పురుషుడు. కృష్ణ యనగా శక్తివంతంగా యోగుల మనస్సును ఆకర్షించి ఆయన చెంతకు చేరగనే దుర్మార్గమును, పాపములను రూపుమాపెడివాడు. భగవంతుని 16 నామములుగల యీ మహా మంత్రమును భక్తితో స్మరించుటవలన మానవులు మాయకు దూరమై పరమాత్మ సాక్షాత్కారమును పొందగలరు. ఈ పుణ్యదినము నాడు మన మందరము యీ మహా మంత్రమును జపింతము !

ఈ కల్లోల కలుషిత ప్రపంచములో సత్యమార్గమున జీవయాత్ర నుపక్రమించినవారికి శ్రీరామచంద్రుని జీవితచరిత్ర కనువిప్పులాంటిది. శ్రీరాముని వ్యక్తిత్వంలో విధేయుడైన కుమారుడు, ప్రియమైన సోదరుడు, విశ్వాసపాత్రుడైన భర్త, ధర్మస్వరూపుడు, కరుణా హృదయుడైన రాజ్యపాలకుడు, సత్యవ్రతుడు, క్షమాసముద్రుడు యిమిడియుండి ఆదర్శనీయుడైనాడు. శ్రీరాముని ఆశ్రయించినవారికి దుర్మార్గమునుండి రక్షణ సమకూరి శాంతి భద్రతలు సమకూరును. శ్రీరాముడే స్వయంగా "నా శరణుజొచ్చి 'నేను నీ వాడిని – రక్షించు !' మని ఒక్కసారి ప్రార్థించినా రక్షించుట నా ప్రతిజ్ఞ" అని చెప్పియున్నాడు.

మానవ జీవితముయొక్క ఉద్దేశము పరమాత్మ సాక్షాత్కార సాధనయై యుండవలెను. వేదములు, ఉపనిషదులు, భగవద్గీత ఆత్మానందమును పొందుటకు వివిధ మార్గములను చూపుచున్నవి. మానవజీవయాత్రలోని అనేక కష్టములకు, బాధలకు అహంకారమును విడనాడకుండుట, శరీరమే ప్రధానమైనదని ప్రాకులాడుట కారణములు. యుగధర్మమే ప్రపంచమును అశాశ్వతమైన సుఖదుఃఖములతో రూపొందించుచున్నది. ఆత్మవిచారము, పరిశీలనవలన, సర్వము నిచ్చు, అసమానమైన ఏకాత్మను గురించిన సత్యమును తెలిసికొనకలుగుచున్నాడు. ఆత్మ అనంతమైనది. అశాశ్వతమైన బుద్ధి, శరీరము, ప్రపంచమునకు ఆత్మలేనిదే వాని ఉనికి కవకాశములేదు.

కంచి కామకోటి పీఠాధిపతులు – జగద్గురు శ్రీ స్వామి శంకరాచార్యులు ఆత్మ, పరమాత్మలను బహు చక్కగా వివరించిరి. ఋగ్వేదములో ఆత్మ పరమాత్మలు, ఒకడు రావిచెట్టుమీద కూర్చొని చేదు, తియ్యని ఫలములు తినునట్లు మంచి, చెడ్డ కార్యములుచేయుట, మరొకడు దేనితోను సంబంధములేకుండా ఆత్మానంద మనుభవించునట్టివని వివరించిరి. దాని అర్థము వ్యక్తిత్వము రజోగుణమువలన దుర్మార్గ, సన్మార్గముల ననుసరించుచుండును. అయితే సర్వోత్కృష్టమైన ఆత్మ గుణాతీతంగా శాశ్వతమైన స్వేచ్ఛానందముల ననుభవించగలదు. హిందూతత్వశాస్త్రవేత్త మన ఇండియా వైస్ ప్రెసిడెంటు పూజ్యులు డా|| రాధాకృష్ణన్ గారు భూలోకములో మన జీవయాత్ర ఆత్మను లోపర హితముగా చేసికొనుట కవకాశమనియు, సంసారము ఆధ్యాత్మిక అవకాశములకు పారంపర్యమనియు, అట్టి ఆధ్యాత్మిక పరిపూర్ణత్వమును సాధించు మార్గములో నది ఒక సోపానమని వివరించిరి. శ్రీరాముని జీవితము మానవుడు అన్ని విధముల పరిపూర్ణత్వమును సాధించి, దురాశలకు లోనుచేయగల మాయకతీతుడుగా, యీ జీవితములోనే పరమోత్కృష్టమైన ఆత్మానందమును పొందుటకు తోడ్పడునది, ప్రోత్సహించునది. సీతాదేవి ధర్మం, ఓర్పు, దివ్యత్వము ఉత్తమోత్తమములై మన స్త్రీలోకానికి శాశ్వతముగా, ఆదర్శనీయంగా, పూజనీయంగా రూపొందడాని కనువుగా నొప్పినవి.

శ్రీ సాయిబాబా భక్తులకు శ్రీరామనవమి ఆధ్యాత్మికంగా అత్యంత ప్రాముఖ్యమైనది. శ్రీ బాబా 'కృష్ణ, రామ, శివ, మారుత్యాది రూపాయ'గా కీర్తించబడి ఆరాధించబడుచున్నాడు. ఆయన పరమాత్మరూపమై భక్తులను తన్మయులుగాచేసినా ఆయన అయిదడుగుల మానవాకారం మాత్రముకాదు. ఆయన అన్ని జీవరాసుల్లో నున్నాడు. సర్వాంతర్యామి. అయితే ఆయన జీవితకాలంలో షిర్డీలో శ్రీరామనవమి ఉత్సవమును ప్రారంభించాడు. ఇప్పటికి అది జరుగుతున్నది. శ్రీ సాయిబాబా శ్రీరాముని ఆరాధించుటవలన భక్తులు నిజమైన భక్తి నలవరచుకొనుటకు సగుణ ఆరాధన ఆవశ్యకతను రుజువు చేసెను. అందువలన వారి హృదయములు పవిత్రములై, భగవత్సాక్షాత్కారమునకు అనువైనవగును. భగవంతుని కరుణాకటాక్షములకు పాత్రులగుటకు పరమాత్మను ప్రతిజీవిలోను చూడకలిగి ప్రేమించవలెను. హిందువుల శ్రీరామనవమి ఉత్సవంతోపాటు మహమ్మదీయుల చందనోత్సవం యీ పుణ్యదినంనాడే షిర్డీలో జరుగును.

ఈ పుణ్యదినంనాడు రామాయణంలోని ఉత్తమ పాత్రాలమీద మన దృష్టిని ప్రసరిద్దాం! మన శక్త్యానుసారంగా పవిత్రమైన శ్రీరామచంద్రుని జీవిత మార్గాలను అనుసరిద్దాం! శ్రీ సాయిబాబా తన భక్తులనుండి 'భక్తి విశ్వాసములు, ఓర్పును ఎదురుచూస్తుంటాడు. పాపవిమోచనమునకు, సుస్థిరమైన ఆత్మానందమునకు అత్యంత భక్తి, అన్ని జీవరాసులపట్ల ప్రేమ, భగవధ్యానము అవసరమని శ్రీ బాబా అనిరి. గురువుయొక్క కరుణా కటాక్షములు మన సుఖ సౌభాగ్యములకు, శాంతికి, అన్ని కష్టాలనుండి విముక్తికి అమృత తుల్యములైనట్టివి. మనకొరకు సిద్ధముగా నున్న యీ మధురమైన, పవిత్రమైన అమృతము శ్రీ సాయిరాం కరుణాకటాక్షములవలన మీరందరు రుచిచూచెదరుగాక!

శ్రీ సాయిబాబా పలుమారు సూచించిన దానిని మీ దృష్టికి తెచ్చుచు, భక్తి పారవశ్యము నలవరచుకొనుటవలన భగవంతుని నామము హృదయములలోనేకాక పెదవులపై సయితము చివరిదాకా స్థిరపడనీయుడు! భక్తులందరు బాబా బోధనల ననుసరించి యీ కలియుగంలో సులభసాధ్యమైన శ్రీ సాయిరాం నామస్మరణచేసి తరింతురుగాక!

ఓం శ్శాంతి, శ్శాంతి, శ్శాంతిః



# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

"నేను చాలా పాపాత్ముణ్ణి శారదా! నిన్ను చాలా హింసపెట్టాను. అందుకే నేనిప్పుడు యమ యాతనలనుభవిస్తున్నాను. నిన్ను సంతోషపెట్టలేక పోయాను. నిర్దాక్షిణ్యంగా ఏడిపించాను. యిక నేను జీవించను -" అంటకన్నా, ఆయాసం వల్లనూ - బలహీనంవల్లనూ - ఎక్కువచెప్పలేక పోయాడు.. వీరభద్రం, ధైర్యం చెపుతూ_

"నువ్వేమీ బెంబేలుపడకు. నీ కోసం నేనేం చెయ్యమన్నా చేస్తాను. నీ దయవల్ల, యింతవరకూ జీవనోపాధికల్గి బ్రతుకుతూ వచ్చాను. నీ పట్ల నా కున్న విశ్వాసాన్ని, ఎలా తీర్చమంటే, అలా చేస్తాను.. చెప్పు.."

నారాయణరావు.. తనకున్న శక్తితోనే_

"నా దారిన నేనుపోతే, శారదగతి ఏంగాను? పిల్లవాడి శ్రేయస్సు ఎట్లా? దిక్కుతోచకుండా వుంది" - కంట నీరు పెట్టుకున్నాడు.

"నేనూ అదే ఆలోచిస్తున్నా" - దీంగాలోచనలో అన్నాడు వీరభద్రం.. శారదకి ఏమీతోచకుండావుంది.. ఏడ్పుతప్ప.

"నువ్వు శాస్త్ర కనిపెట్టుకొనివుండరాదూ!" - నారాయణరావు జేలగా అన్నాడు. వీరభద్రం, శారదవంక చూసాడు. శారద, తన ముఖాన్ని చేతుల్లో దాచుకొని గోడుగోడున ఏడుస్తోంది. పిల్లవాడు, బొమ్మలతో ఆడుకొంటున్నాడు వసారాలో. నారాయణరావు, అంత మనోవ్యాధిలో వుండికూడా అలా అనేసరికి, శారద హృదయం ఒక్కసారిగా క్షోభించింది. వీరభద్రం, నారాయణ రావువంకచూస్తూ_

"నీ ఋణం, పోనీ అలాగైనా తీర్చుకుంటాను. విచారపడకు. నా శక్తికొద్దీ కష్టపడి, నీ శారదనీ, పసివాణ్ణీ కనిపెట్టుకొనే వుంటాను. యింతకాలం నీ ఆశ్రయంలో బ్రతికినవాణ్ణి. కాదనలేను. మాటిస్తున్నాను.. అలాగే వుంటాను" అన్నాడు.

నారాయణరావు మనస్సు కుపితమైందనే శారద భావించింది. భర్తకు, నయమవుతుందని ఆశించినందుకు, తనగతే విషమస్థితి కొచ్చిందని కుమిలి, కుమిలి ఏడ్చింది. తరువాత వీరభద్రం చక్కాపోయాడు, 'నారాయణరావు మరణం ఎంత త్వరగా జరిగితే, అంత మంచిదని' వూహించాడు. వీరభద్రం ఎలాంటి ఆలోచన చేసాడు! యిలాంటివాళ్లని భగవంతు డెందుకు సృష్టించుతాడో! బహుశా శారదవంటి స్త్రీలకు బాధల్ని కల్గించి, పరీక్షించడానికేనేమో! నారాయణరావులాంటి వాళ్లని చెడగొట్టి, స్వార్థపూరితంగా బ్రతకడానికేనేమో!

రెండు రాత్రులు గడిచినయి. అమావాశ్య ఆ నాడు. వీరభద్రం ఆ సమయంలోలేడు. శారద తిండిలేక, నిద్రలేక, కృశాంగి అయింది. పసిపిల్లవాడు నిద్రపోతున్నాడు. నారాయణరావు వుండీవుడిగి మూల్గుతున్నాడు. మధ్య మధ్యా కాఫీత్రాగి, దడని తగ్గించుకొంటున్నాడు. కళ్ళు లోతుకుపోయినయి. శరీరం శల్యావశిష్టమైంది. రొప్పు_ఆయాసం ఎక్కువైంది. గాలివల్ల, వూపిరితిత్తులు ఎగిరెగిరిపడుతున్నవి. దాహం అవుతోంది. కాచివడబోసిన నీళ్ళు శారదయిస్తే, అతికష్టంమీద త్రాగాడు. _ చెరిసగం రాత్రి అప్పటికే గడిచింది. భారంగా మూసుకొనివున్న కళ్లనితెరచి, శారదని పిల్చాడు. ఆమెలేచి అతని మంచంమీద కూర్చొంది. కళ్ళవెంట ధారాపాతంగా నీళ్ళు కారుతున్నాయి. నారాయణరావు, సత్తువలేని చేతినెత్తి, కొనగోళ్ళతో, ఆమె కన్నీటిని తుడుస్తూ_

"ఏడుస్తున్నావా?" _ అన్నాడు. ఆమె ఒక్క మారుగా బావురుమంది. అతని గుండెలు అలిసినయి. _ ధైర్యంకోసం _ ముఖంలో పైకికన్పడేలాగు నిబ్బరంతో _

"లేదు.." _ అంది.

"బాబు ఏడి?" - రుద్ధకంఠంతో అడిగాడు. శారద లేచివెళ్ళి, కుమారుణి ఎత్తుకొచ్చి, భర్త

పక్కలో పడుకోబెట్టింది. అతను కుమారుణ్ణి ముద్దెట్టుకున్నాడు. తలనిమిరాడు . . శారద, అంత ఏడుపులోనూ, చిరునవ్వు నవ్వింది. నారాయణరావు తృప్తిపడ్డాడు . . ఆమె చేతిని, తన చేతుల్లోకి మెల్లిగా తీసుకొన్నాడు, శారద దగ్గరగా జరిగి, అతని గుండెలమీద వాలిపోయింది. తల నిమురుతూ-

..."శారదా!"_అన్నాడు. తలెత్తి చూసింది. నవ్వుతున్నాడు. . అతని మనస్సు శాంతికోసం తృప్తిగా నవ్వింది . . అంతే తెలుసు నారాయణ రావుకి . . మిగతా భాగంయొక్క పర్యవసానం, శారదకు తెలుసు. నారాయణరావు ఆత్మ, ఆ నాటి ప్రగాఢ ధ్వాంతంలో, అనంతవాయువులో కలిసిపోయింది. శారద ఒక్కసారిగా, గావురుమంది. పసిపిల్లవాడికేమీ తెలియకపోయినా, ఏడ్చాడు. రక్తస్పర్శ అలాంటిది. అమావాస్య ఎంతటి చీకటి పాపంతో కూడివుందో, శారదకప్పుడర్థమైంది. ఎవ్వరూ శారద నా సమయంలో ఓదార్చేవాళ్ళు లేకపోయారు . . దిక్కులేనిచక్క, భర్తశవంపైబడి, భోరున ఏడుస్తూ - ఆ తెల్లవార్లూ గడిపింది.

అది జ్యేష్ఠమాసం. రోహిణీకార్తె ప్రవేశించింది. ఉబ్బ వినుకులు రెండు మూడుసార్లు పడినయి. ఆకాశం, ప్రొద్దుతిరుగంగానే పొగమబ్బులతో కమ్ముకోవటం జరుగుతోంది. పెద్ద పెట్టున గాలి దుమారంలేచి, కోతకొచ్చిన మామిడికాయల్ని రాల్చుతోంది. వడగాలి వీవటంకూడా బాహాటంగా వుంది. రైతులు ఆకు మళ్ళుపోసేసారు. కృష్ణకాలవలు బిగట్టివేసేసారు, వానకోయిలలు వర్షాగమనాన్ని సూచించే సంగీతం, ఆకురాలిన చెట్ల కొమ్మలపైకూర్చుండి, కట్టిస్తూకూస్తున్నయి.

జగన్నాథం, ఆ కోయిలలకూతల్లోవున్న సారస్యాన్ని వింటూ, ఒక నాడు పడకకుర్చీలో జారగిలబడి చుట్ట కాలుస్తున్నాడు. వాకిటరుగులమీద యిద్దరు ముగ్గురు పిల్లకాయలు చేరి, ముంజికాయల్ని నరుక్కొని తింటున్నారు. ఆరబోసిన పన్నెండో పెంబరు ధ్యానం కాస్తున్న ఎండవేడిమికి తడిదనాన్ని పోగొట్టుకొంటున్నాయి.

ముందువాలో జగన్నాథం భార్య దుర్గమ్మ నవ్వారు మంచంమీద పడుకొని, ఉక్కపోతకి, వూపిరాడక, తాటాకుల విసనకర్రతో మగతగా కళ్ళు మూసుకొని, ఆపసోపాలు పడుతూ విసురుకొంటోంది. పడమరవేపు దొడ్డిగుమ్మంలో, దట్టంగా పడుతున్న బాదంచెట్టు నీడలో ఆయింటి కోడలు జయలక్ష్మి పమిటచెంగు పర్చుకొని, స్త్రీలవ్రతకథల పుస్తకాన్ని నోట్లో - నోట్లో చదువుకుంటోంది. ఆకు మళ్ళనీటి తడుపులికి కెళ్ళిన ఆమెభర్త ధర్మారావు యింకా యింటికి తిరిగిరాలేదు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది ...

ప్రొద్దు నిప్పుల్ని చెరుగుతోంది - గ్రీష్మతాపం జగన్నాథాన్ని ఎక్కువసేపు కుర్చీలో జారగిలపడుకోనివ్వలేదు. నెమ్మదిగాలేచి, వీధితలుపుల్ని వేద్దామని, వెడుతూండేసరికి, ఎదురుగా తపాలా బంట్రోతు విసురుగా వచ్చి, నుదుట పట్టిన చెమటను కొనగోళ్ళతో తుడిచివేసి, ఒక కార్డుయిచ్చి,గిరుకున్న వెనుతిరిగి చక్కాపోయాడు. వెంటనే అందుకున్న కార్డుపైవున్న అంశాలు ఏవో అతణ్ణి మెలివేసినయి. కుడి చేతితో ఆవుత్తరాన్ని అలాగే పట్టుకొని, ఎడమచేతితో గొడ్డూగోదారాకుండా వీధితలుపుల్ని గట్టిగా గడియవేసి వసారాలో కొచ్చాడు. ఆ తలుపుల చప్పుడుకి కుర్రాళ్లు. అరుగులమీదినుంచి రోడ్డుమీదికి దూకి, తాటిగెలతోసహా చెరువుగట్టుకి చేరారు. ఆరబోసిన ధాన్యాన్ని ఒక్కసారి ఆరచేద్దామని, కుర్చీలోంచి లేచినజగన్నాథం, ఆవుత్తరం ధ్యాసలోపడి, పూర్తిగా మర్చిపోయాడు. అప్పటికీ అందులోవున్న విషయం నమ్మశక్యంకాకుండానేవుంది. . కాని, ఎంతమానంగా, తనలో తానై _ చదువుకున్నా ఆశ్చర్యమే కలుగుతోంది! ఉత్తరంలోవిషయం తప్పని తానెల్లావూహించటం స్పష్టంగా ఉన్న సంగతేదో కళ్ళకి కనిపిస్తుంటే! నమ్మకుండా వుండటం ఎట్లా?

వెంటనే జగన్నాథం కోడల్ని పిల్చాడు. జయలక్ష్మి ఆపాళాన లేచి, చేతిలోవున్న పుస్తకాన్ని అలమారాలోవుంచి, మామగారి దగ్గరకొచ్చి,-

"ఏమిటీ!" అన్నట్లుచూసి, గుమ్మం ప్రక్కనే చాటుగా నిలబడింది. జగన్నాథం తనచేతిలోని వుత్తరమిస్తూ -

"కాస్తబిగ్గరగా చదువమ్మా!"_అని కుర్చీలో కూలబడ్డాడు, కుంచించుకొనిపోతూ. జయలక్ష్మి ఆవుత్తరాన్ని చూసేసరికి భయమూ _ అనుమానమూ కల్గినయి. ఉత్తరానికి నాలుగుమూలలా మసిమరకలున్నాయి. వ్రాసిన అక్షరాలు అలికివేసినట్లుగా వుండి ఏమిటో దీనాతి దీనమైన పరిస్థితిని వ్యక్తం

చేస్తోంది. తల్ల క్రిందులుగావున్న ఆ కార్డుని, సరిగా పుచ్చుకొని -

"పూజ్యులైన జగన్నాథం బావగారికి -

శారద నమస్కరించి వ్రాయునది.

మీకూ - మాకూ బంధురీత్యా రాకపోకలు సన్నగిల్లినప్పటికీ నేను మీకు పరాయిదానినేమీ కాను. యీ రోజుతో నా జీవితం చీకటిగా మారిపోయింది. పరమపూజ్యులైన మీ తమ్ముడుగారు ... నేను యిక వ్రాయలేకపోతున్నాను. ఏదో బాధ, దుఃఖపూరితమై, నా హృదయాన్ని కలచివేస్తోంది. పసివాడు తండ్రికోసం తపించి పోతున్నాడు. వాడి భవిష్యజ్జీవితాన్ని మీరంతాకలిసి దయతో ఎలా పరిష్కరించి, వంశగౌరవాన్ని నిలబెట్టేందుకు ప్రయత్నిస్తూ, ఒకదరికి చేస్తారోనని నమ్ముకొని వున్నాను. మీ చూపులికి అందనీయకుండా, మృతకళేబరాన్ని లేకుండా చేసినందుకు క్షమించకోర్తాను, లోగడ మనకున్న ద్వేషాల్ని - పగని - కక్షల్ని మర్చిపోయి యీసారికైన మీరు రాగలరని ఆశిస్తూ - నమస్కరిస్తున్నాను."

మీ

శారద

— అని వణకుతూ చదివేసింది. రెండు కన్నీటి బొట్లు జలజలా రాలినయి. జగన్నాథం కళ్లుకూడా చెమ్మగిల్లినయి. ఆలసాలసంగా జయలక్ష్మి చదివిన వుత్తరంలోని సంగతులికి దుర్గమ్మ లేచి, చేతిలో వున్న విసనకర్రని అమాంతంగా గోడవైపుకి విసురుగా విసిరిపారేసి గబగబా భర్తముందుకొచ్చి -

"ఏమిటండీ! నారాయణరావు పోయాడా!"

అని కోడలి చేతిలోంచి ఆ కార్డునితీసుకొని, చూస్తూ కంటనీరెట్టుకుంది. జగన్నాథం, తల ప్రక్కకి పెట్టుకొని కళ్లు మూసుకొని నారాయణ రావుని గుర్తుచేసుకోసాగాడు.

ఇంతలో ధర్మారావు మిటమిటలాడే ఎండకి రొప్పుతుంటూ - రోజుకుంటూ, పొలంనుంచి వచ్చాడు. ఆసమయంలో అందరి ముఖాల్లోనూ విషాదపూరితమైన భావం ఏదో పొతరలాడుతోంది. "ఏమిటో అఘాయిత్యం జరిగిందని" వూహించాడు. మెల్లిగా, తొడుక్కున్న చెప్పుల్ని, క్రిందిమెట్లమీద విడిచి, తల్లిదగ్గరగా వచ్చి, ఆవుత్తరాన్ని అందుకోబోతూండగా - జయలక్ష్మి అతనివంక చూస్తూ -

"మీ నారాయణరావు బాబాయిగారు ..."

ఇక చెప్పలేక, పమిటకొంగునోటికడ్డం పెట్టుకొంది. అతను ఆమాటకి ఒక్కసారిగా వూగి, తమాయించుకొంటూ, చేతిలో వుత్తరాన్ని చకచకమంటూ చదివేసాడు. మొదట్లోనమ్మలేక పోయాడు. చివరకు సానుభూతిగా నమ్మదామనుకునేసరికి పాతకలహాలు - కక్షలూ గుర్తొచ్చి, అతని హృదయాన్ని కటువుగా మార్చి వేసినయి.

"చేసిన మోసానికీ - పాపానికీ తగిన ప్రాయశ్చిత్తమే జరిగింది. మనవంశానికి యిక పీడా వదిలిపోయింది -" అని, జగన్నాథం హృదయం తూట్లు పడేలాగు అన్నాడు. జగన్నాదం ఆక్షణంలో సహించలేక -

"ఎందుకురా అలా నోరుచేసుకొంటావ్! వాడికీ - నాకూ తగాదాలున్నంత మాత్రాన నువ్విలా లెక్ఖలేకుండా మాట్లాడటం మంచిదిగాదు. వ్యక్తిగతంగా మా యిద్దరికీ ఎన్నో వుంటయి. అంత మాత్రానికి నీకేం బాధ్యత వున్నట్లు దురుసుగా అంటావ్. తప్పకాదూ! వాడెంత నీచుడైనా - దుర్మార్గుడైనా - చెడినవాడైనా, నేను అన్నగార్ని కాబట్టి వాడ్ని 'నా'వాడని ఎంచుకోక తప్పదు. చచ్చినా వాడిపేరు నాకు రక్తసంబంధమైందే!"-

ఎంతో సహనపరుడైన జగన్నాథం, ఆ సమయంలో అంతకన్నా ఎక్కువగా అనలేకపోయాడు. తనతమ్ముని సంసారాన్ని గురించి, తానిక ఏవిధంగా మాట్లాడినా, ప్రయోజనంలేదనియెంచి స్తబ్దుగా కూర్చుండిపోయాడు. తనకున్న మర్యాదనీ, గౌరవాన్ని, తమ్ముడిపట్ల వ్యక్తంచేస్తూ, వృథాప్రసంగం చేసినందువల్ల, గిట్టనివాళ్ళ మనస్సు అనేక రకాలుగా వుద్రేకపడుతుందని వూహించి మౌనరూపం ధరించాడు. అనవసరంగా యితరులను, తన స్వార్థం కోసం హింసించటం న్యాయంకాదని భావించే తత్వంగల మనిషి జగన్నాథం అంటే. అలాంటప్పుడు నోరు మెదపటం దేనికి? భార్య అయిన దుర్గమ్మకి - కుమారుడైన ధర్మారావుకీ చులకనభావం కల్గేలాగు ప్రవర్తించటం ఎందుకు? తాను యీ కాస్సేపు, తమ్ముణ్ణి గురించి, పైకిఅనకుండా వుండటమే సబబుగా తోచింది. అందుకని జగన్నాథం ఎవరిపట్లా ఏదురాభిప్రాయాన్ని ఏర్పడేలాగు చేయకుండా ప్రసంగాన్ని విరమింపచేసుకున్నాడు. దుర్గమ్మ కీహఠాత్పరిణామం ఎందుకు తన భర్తలో కల్గిందో ఆశ్చర్యం వేసింది. జగన్నాథం అన్న మాటలకు ధర్మారావు నోరు తిరిగి మెదపకుండా, భోజనానికి వంటింటి గుమ్మంవైపుకి దారితీశాడు. అతణ్ణి అనుసరిస్తూ జయలక్ష్మికూడా లోనికేగింది.

(సశేషము)

# "ఉంటుందయ్యా! — ఉంటుంది
# ఉంటుందమ్మా! — ఉంటుంది"

శ్రీ మరువాడ సూర్యప్రకాశం



అత్తగారికి ... ఆగ్రహము
ఆలయానికి ... విగ్రహము
అద్దెకొంపకు ... తగాదాలు
ఆలుమగలకు ... వివాదాలు
అన్నదమ్ములకు ... వంతులు
ఆకాశమ్మున ... మబ్బులు
కూలివాండ్రకు ... కష్టము
నువ్వులపంటకు ... నష్టము
నల్లకూలికి ... బరువు
నీతివంతునకు ... పరువు
పెంటగొయ్యిలో ... గత్తము
పెనులోభివద్ద ... విత్తము
జామచెట్టుపై ... చిలుక
లేమిఅల్లునకు ... అలుక
మబ్బుకొండకు ... మెఱుగు
మంచిపాలకు ... పెఱుగు
పాతగోడకు ... పగులు
పంటచేలకు ... తెగులు
కొఱ్నభూమిలో ... కలుపు
క్రొత్త ప్రియులకు ... వలపు
నిండు చెఱువులో ... కలువ
నిజము పలికిన ... విలువ
పురుషునకు ... మీసము
కలుషునకు ... మోసము
కుమ్మరిమన్నుకు ... జిగురు
కొత్త అల్లునకు ... పొగరు

మేహారణమందు ... చీము
మంటి పుట్టలో ... పాము
వెన్నపూసలో ... నేయి
వెన్నెలరేయిలో ... హాయి
పాతబట్టకు ... చిరుగు
పసిడినగలకు ... తరుగు
గృహస్థుకు ... ఖర్చు
విరాగికి ... బొచ్చు
మంచినీటి చెఱువులో ... కప్పలు
మానవుని క్రియలందు ... తప్పులు
ధనికునకు ... గర్వము
ధూర్తునకు ... మర్మము
మానికట్టుకు ... బొగ్గు
మరదలు పిల్లకు ... సిగ్గు
నులకమంచమున నల్లి
సానికొంపలో . . తల్లి
తెలుగుభాషకు ... తేట
తెల్లనిబట్టకు ... నీటు
మగువమెడలో ... హారము
మిరపకాయకు ... కారము
పేదలకు ... ఖేదము
సంపన్నులకు ... మోదము
కవిచేతిలో ... కలము
కంటిరెప్పలో ... జలము
స్త్రీలచేతులందు ... గాజులు
చీకటిండ్లలో ... బూజులు.

# అక్కా! బావచ్చేరే!

శ్రీ నాయుడు వెంకటసీతారామమూర్తి

"అక్కా! బావచ్చేరే!" అంది లక్ష్మి గబగబా పరిగెత్తుకుంటూ వస్తూ. వంటింట్లో కూర్చుని కూరగాయలు కోస్తున్న నాకు యీ సంగతి వినడంతోటే ఆనందంతో పాటు కొంచెం కంగారుకూడా కలిగింది.

"నిజంగానా? వారొచ్చేరా?" పరిగెత్తుకు వెళ్లి పలుకరిద్దామంటే చెపలేనంత సిగ్గేసింది. అవునుమరి! పెళ్ళయి యింకానెల పూర్తికాలేదు. వచ్చీరావడంతోటే ఎదురుగా వెళ్ళి 'రండి, కూర్చోండి' అని అనగలిగినంత ధైర్యమూ సాహసమూ ఎక్కడిది! అమ్మకూడా యింట్లో లేదు. నాన్న సరేసరి! పగలల్లా ఆఫీసులోనే ఉంటాడు. ఎట్లా చెప్మా! యింట్లో ఎవ్వరూలేని సమయంలోనే వారు రావాలా? ఎవ్వరూ లేకపోవడం ఏమిటి? తాను ఉందిగా! లేత గులాబీ రేకుల్లాంటి పెదిమలు చిరునవ్వుతో చిందేయి.

"వారొచ్చేరు! భోజనం టైముకు మరీవచ్చేరు! వారికి కావలసిన మంచిమంచికూరలూ, అవీ వండాలి. యింటికి కొత్తల్లుడుకదూ! బాగా గౌరవించకపోతే వారేమనుకుంటారో? కాళ్లు కడుక్కోడానికి నీళ్లివ్వాలి. మంచినీళ్లుకావాలా?" అని అడగాలి.

"లక్ష్మి! లక్ష్మి! ముందు వారికి కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళియ్యి" అన్నాను కంగారుగా.

"బావకు నీళ్ళిచ్చేనుగా! కాళ్ళు కడుక్కుని కుర్చీలో కూర్చున్నాడు" అంది లక్ష్మి చిలిపిగా.

"అయితే ముందుగా నాతో చెప్పలేదే! ఎండవేళొచ్చేరు. మంచినీళ్ళు కావాలా?" అని అడిగేవా?

"నాకు తెలీదా అక్కా! మా బావకు ఉట్టి మంచి నీళ్ళిస్తే మర్యాదగా ఉండదని - ఎస్సెన్సు-నాన్న తెచ్చేడు చూశావూ! అది కాస్త కలిపిచ్చేను."

"నా కంటే ముందుగానే బావను సవరించుకున్నావన్నమాట! యిన్ని పనులూ చేస్తూ ముందుగా నాతో ఎందుకు చెప్పలేదే!"

"చెప్తామనుకుంటుంటే బావనన్ను వెళ్ళనిస్తేగా!"

"వెళ్ళనివ్వక చొక్కాను కట్టుకుని ముడేసుకున్నారా?"

"అదికాదే అక్కా! యీ సంగతి నీతో చెప్తామని వస్తూంటేనూ - మీ అక్క యింట్లో ఉందా? ఏంచేస్తోంది? ఎక్కడికైనా వెళ్లిందా? అని యక్షప్రశ్నల్లా లక్షప్రశ్నలు అడిగేరనుకో! సమాధానం చెప్పడానికి ఉక్కిరిబిక్కిరై పోయాను."

"నన్నుగురించే అడిగేరా? "ఎప్పుడూ పొందని ఆనందం - ఆనాడే - ఆ ఒక్క నిముషంలోనే పొందినట్టయింది." అయితే సమాధానం ఏమని చెప్పేవే? త్వరగా చెప్పవే?"

"ఊహూ! నేను చెప్పను" భీష్మించుకు పోయింది లక్ష్మి.

అయినా లక్ష్మి మరీ అల్లరి పిల్లయిపోయింది. దాని వేళాకోళానికి వేళాపాళా ఉండదు. అందులోనూ యిటువంటి సమయంలోనా పరిహాసం!

"చెప్పవే? నా ముద్దు చెల్లివికదూ? వారితో చెప్పి మంచి మొగుణ్ణికొని తీసుకురమ్మంటాను. చెప్పవూ?"

"హా! అక్కా నేను చెప్పను"

"నా చిన్నారివికదూ? నాతో చెప్పవూ?"

"చెప్తే ఏమిస్తావు?" చిలిపిగా అడిగింది.

"చెప్పడానికి లంచమా?"

"లంచం కాదే అక్కా! 'లాంఛనం' అట నాన్న చెప్పేవాడుకదూ? ఆఫీసులోని కాగితాలు తీసి

చూపించినందుకు అయిదు రూపాయలు లాంఛనం పుచ్చుకునేవాడినని!"

"నోర్మూయ్యవే! ఆ పెద్దగొడవలన్నీ నీకెందుకూ? ముందు యీ సంగతి చెప్పవూ? త్వరగా చెప్పమరి' వారొక్కరే సావిట్లో కూర్చున్నట్టున్నారు"

"మరి నాలాంఛనం మాట?"

"ఎక్కడ దొరికేవే నాకు! సరే! యీ వేడకాను తీసుకో. వారడిగితే నువ్వేమని చెప్పేవు?"

"చెప్తున్నానుండుమరి! నేను వీధిలో ఆడుకుంటూంటే బావచ్చేరే! 'రండి బావగారూ' అని ఆహ్వానించేను. నీతో చెప్పకుండా నేనే సవిరించుకు పోవాలనుకుని కాళ్లు కడుక్కోడానికి నీళ్ళిచ్చి, డ్రింకిచ్చి ఎంత మర్యాద చేసేననుకున్నావ్! తర్వాత నన్ను దగ్గరకు రమ్మని పిలిచి 'లక్ష్మి అక్కేంచేస్తోంది? యింట్లో ఉందా?' అని నెమ్మదిగా అడిగేరే! నాకు ఒక్కటే నవ్వు!"

"సరే! దానికి నువ్వేమని చెప్పేవ్!"

"నవ్వుతూ నేనేమని సమాధానం చెప్పేనో తెలుసా?"

"త్వరగా చెప్పవే?"

"అయినా పెళ్లాన్ని గురించి సిగ్గులేకుండా ఎవ్వరైనా ఆవిధంగా అడుగుతారటే?"

"అడిగితే అడిగేరు. నువ్వుత్వరగా చెబుదూ?"

"వచ్చి అయిదు నిముషాలన్నా కాలేదు. అప్పుడే పెళ్ళాం గురించి అంతబెంగ పెట్టుకు పోవాలా?"

"దానికేంగానీ విషయం చెప్పవే?"

"చెప్తాను ఉండుమరి! ఏదో పెద్ద రహస్యం చెప్పినట్టు, ఎక్కడ నీకు వినిపిస్తోందని దగ్గరకుపిల్చి చెవిలో మరీ చెప్పేరు."

"అది సరే లేవే! నువ్వేం చెప్పేవో అది చెప్పు!"

"మరదల్నికాబట్టి సరిపోయిందిగానీ యీసంగతి అమ్మో నాన్నావింటే ఎంతగా నవ్విపోతారో తెలుసా!"

"నవ్వితే నవ్వేరుగానీ యింతకూ నువ్వు చెప్పవన్నమాట!" "చెప్పక ఏంచేస్తాను లాంచనాలు కూడా పుచ్చుకున్న తర్వాత!"

"యీ సంగతి చుట్టు పక్కలమ్మలకు తెలిస్తే యీ అబ్బాయి పెళ్లాం పమిట కొంగును పట్టుకుని వదిలేలా లేనట్టున్నాడే? అని గుసగుసలాడుకోరూ?"

"అబ్బబ్బా; చంపక చెప్తే చెప్పు లేకపోతే మానెయ్యి"

"అంతకోపం ఎందుకే అక్కా! నీగురించి ఏమని చెప్పేనో తెలుసా!"

"తెలిస్తే, నిన్నడగడం ఎందుకూ?"

"నీకోసం కలవరించేస్తోంది బావా? అనేశానే!"

"ఏమిటే నీ అల్లరి మరీను! తప్పుకదూ! అట్లా చెప్పవచ్చా!"

"పర్వాలేదు లేవే — బావేకదూ!"

"వారు వసారాలోనే కూర్చున్నట్టున్నారు. త్వరగా వెళ్లి అమ్మను కేకేసుకురా"

"చెప్పడం మర్చిపోయాను. ఏదో మిఠాయి పొట్లం, పువ్వులపొట్లం నా చేతికిస్తేనూ - వెర్రిబాగులదాన్ని నాకే అనుకున్నాను నేను - నాకు కాదట, 'మీ అక్కకియ్యి' అన్నారు. చూశావా? పక్షపాత బుద్ధి?"

"అవెక్కడ పెట్టేవే!

"కోపంవచ్చి మిఠాయి పొట్లం తినేశాను. పువ్వులపొట్లం బల్లమీద పెట్టేను. త్వరగా వెళ్లు మరి! ఒక్కరే కూర్చున్నారు. నువ్వు వెళ్ళి పలుకరించకపోతే బాగుంటుందా?"

"అవును నిజమే! వచ్చి చాలా సేపయింది కూడాను. వెళ్ళి కనుపించకపోతే బాగుంటుందా మరి!" అంటూ నేను వసారాలోకి వెళ్ళేను కంగారుగా.

తీరా వెళ్లి చూచేసరికి యింకేముంది? కుర్చీలో వారూ లేరూ? బల్లమీద పువ్వులూ లేవు. ఎలక్షన్సులో డిపాజిట్టుపోయిన అభ్యర్థిలా అయిపోయింది నా ముఖం.

"వారెక్కడే? కుర్చీలోకూర్చున్నారన్నావు?" ఒకవేళ ఏ పనిమీదన్నా బజారుకి వెళ్లేరేమోనన్న అనుమానంకూడా లేకపోలేదు.

లక్ష్మి పేళనగా నవ్వుతోంది.

నాకు ఉడుకుమోత్తనం ఆగిందికాదు.

"ఉత్తినే! అక్కా! వేళాకోళంగా అన్నాను. అంతే! అంది" లక్ష్మి.

"ఎంత నాటకం ఆడేవే! వంటింట్లో కూర్చున్న నన్ను ఎంతగా నమ్మించేవ్! వంగనాచివి. ఉండు అమ్మ వచ్చింతర్వాత నిన్నేంచేయిస్తానో "అంటూ బుర్రమీద ఒక్క మొట్టికాయ మొట్టేను.

"చెప్వలో నాకేం! నా బేడా నాకు ముట్టిందిగా! అంటూ తలగోక్కుంటూ బైటికి వెళ్ళిపోయింది.

కాన వచ్చి వెలశినట్టయింది నాకు.

(మరోనాటి ఉదయం)

"అక్కా! అక్కా! బావచ్చేశారే!"

"వస్తే రానీ!"

"అమ్మనిన్ను కేకేస్తోంది"

"కేకేయనీ!"

"నిజంగానే! బావచ్చేరే!"

"వస్తే వెళ్లి నువ్వే సవిరించుకో!"

"మాసవిరింపులన్నీ అయ్యాయి-యింక నీ సవిరింపు లేతర్వాయి. త్వరగా రామరి!"

"రానని చెప్పు!"

"నా మాటనమ్మకపోతే మానెయ్యి. నాకేం!" అంటూ వసారాలోకి పరిగెత్తుకుపోయింది.

"లక్ష్మి నన్ను ఆడించడానికి మళ్ళీ యీ ఎత్తు వేసి ఉంటుందనుకున్నాను. ఒక వేళ నిజంగా వచ్చేరేమో! వస్తేరానీ! అమ్మ నాన్నా ఉన్నారుగా! పోనీ ఒక సారి వసారాలోకి వెళ్ళి చూద్దామని తల వంచుకుని నెమ్మదిగా గడపదాటబోయేసరికి నా తలకు మరోతల 'టంగ్'మని తగిలింది! తలపైకెత్తి చూచేసరికి యింకేముంది. వారే! నిజంగావారే! వచ్చేశారు! పాపం తలకు దెబ్బ తగిలిందేమో! అంత కళ్లు మూసుకుపోతూనడవాలా! అని కేకలేస్తారేమో! సిగ్గుతో తలవంచుకుని వెనక్కి తిరిగి వచ్చేశాను."

(ఆ నాటి రాత్రి)

"లక్ష్మి! యిలారా?"

"ఎందుకు అక్కా!"

"నీకో మంచిమాట చెప్పాలి"

"ఏమిటో చెప్పవూ?"

"నువ్వు జార్జీటు సిల్కుజాకెట్టు కావాలన్నావు కదూ?"

"అవునక్కా! నాన్న తెచ్చేడా?"

"అబ్బే! వారేకొని తెచ్చేరు"

"ఏదీ? త్వరగా చూపించవే?"

"నీ కోసం ఎన్ని తెచ్చేరనుకున్నావ్! కాళ్లకు జోడూ ..."

"అమ్మో! అమ్మో! ఏదీ జోడు!"

"ఏదీ త్వరగా చూపించుమరి!"

"ఉండుమరి! ఆ జోడు కూటా కంపెనీదట. ఎన్నిరంగులున్నాయనుకున్నావ్!"

"అక్కా! అక్కా! నా అక్కవుకదూ! చూపించవూ"

"నాకు తేకుండానే ముందు నీకే తెచ్చేరు. నువ్వంటే వారికి ఎంత అభిమానమో!"

"అవన్నీ ఎక్కడున్నాయి?"

"మొత్తం నలభై రూపాయలయిందటనీకు?"

"సరేలేవే! ముందు అవెక్కడున్నాయో చూపించు!"

"ఎప్పటినుంచో అడుగుతున్నావని నేనే తెమ్మన్నాను"

"గొప్పపనిచేశావు ముందుచూపించవే!"

"జాకెట్టు గుడ్డ యీ ఊళ్లో సరిగాకుట్టరు పట్నం తీసుకువెళ్లి కుట్టించమని నాన్నతో చెప్పదాం"

"అబ్బబ్బా! వేపుకుతినేస్తున్నావ్! చూపిస్తే, చూపించు లేకపోతే మానెయ్యి" (ఏడుస్తుంది)

"ఏడవకుమరి! చెప్తున్నానుగా! నీకు నీలం జార్జిటు అంటే యిష్టమా! ఎర్రజార్జిటు అంటే యిష్టమా?"

"ఏదో ఒకటి యిష్టం. ముందు చూపించు. నీకు దణ్ణంపెడుతాను"

"అయితే ఆగదిలో ఉన్నాయి చూసుకో!" లక్ష్మి గదిలోనికి పరిగెత్తుకుపోయింది.

యింకా నాకు ఉడుకుమోత్తనం తీరలేదు.

లక్ష్మిగదిలోనికి వెళ్లడంతోనే యివతల తలుపు గొళ్లెం పెట్టేశాను.

లక్ష్మి తలుపు బాదుతూ,

"అక్కా! తలుపుతీయవే! యిక్కడ జోడూ లేదు, గుడ్డాలేదు. అంతా మోసం. బావ పడుకున్నగదిలోనికి నన్ను తోసి అవతల గొళ్లెంపెడతావా?

"బాటాజోడూ, జార్జిటు సిల్కు గుడ్డనచ్చేయా?"

"నచ్చడానికి ఉంటేగా! త్వరగా తలుపు తియ్యవే!"

"మరి మీ బావకు కాళ్లు కడుక్కోడానికి నీళ్లూ అవీ యిచ్చేవా!"

"నేను యివ్వలేదు బాబోయ్! తలుపు తియ్యవే!"

"మరి నాకు తెలీకుండా అన్నీ నువ్వే సవరించుకుపోతానన్నావుగా! నువ్వే సవరించుకో!"

"అమ్మోఅమ్మో! తప్పయిపోయింది. ఇంకెప్పుడూ అననే! నిన్ను బ్రతిమాలుకుంటాను. తలుపు తియ్యవే!"

"నాగురించి బావతో యింకా ఏమేమి చాడీలు చెప్తావు?"

"ఏమిచెప్పలేదే! యింకెప్పుడూ చెప్పను. లెంపలు వాయించుకుంటాను. తలుపుతియ్యవే"

యింకచాలనుకుని తలుపు గొళ్లెం తీశాను. సిగ్గుతో లక్ష్మి గబగబా పరిగెత్తుకుపోయింది. నేను గదిలోనికి వెళ్లి గడియవేసుకున్నాను.

—(o)—

## రోజుకు నాలుగు గుడ్లు పెట్టే కోడిపెట్ట

ఒకకోడిపెట్ట రోజుకు నాలుగుగుడ్లను పెట్టింది. అది యెలాగో జరిగిపోయిన ఒక ప్రకృతి వైపరీత్యంకాదు. చైనా పూర్వోత్తర దిశలోని కిరిన్ రాష్ట్రానికి చెందిన చుంగ్‌చాన్ వ్యవసాయ కళాశాలవారు జరిపిన ప్రయోగాల ఫలితంగా ఇది సాధ్యమయింది.

ప్రయోగాల కోసం రెండువందల కోడి పెట్టలు తీసుకోన బడ్డాయి. మామూలుగా కోళ్లకు రోజుకు రెండు పర్యాయాలే మేతపెడతారు. ఈ కోళ్లకు రోజుకు ఐదు పర్యాయాలు మేతపెట్టబడింది. మామూలు మేతతోపాటు ప్రతికోడిపెట్టకు అదనంగా మరొకపౌను క్రిమిసంహారక మేత పెట్టబడ్డది. వాటిగూళ్లు శుభ్రంగా ఉంచబడుతూ ఉండేవి. పరిశుభ్రమైనగాలి సమృద్ధికరంగా వీచేటట్లు యేర్పాట్లు చేయబడ్డాయి. రోజుకు పద్దెనిమిదిగంటల పాటు కోళ్లకు వెలుగు లభించేటట్లు చేసారు. ఇందుకోసం సూర్యాస్తమానంతరం ఎలక్ట్రిక్ దీపాల వెలుగును ఉపయోగించేవారు.

ఇలా కల్పింపబడిన పరిస్థితుల్లో పదిరోజులు గడిచేకల్లా ఆకోడి పెట్టలు పెట్టే గుడ్ల సంఖ్య పెరగసాగింది. ఒక రోజునే కోళ్లు రెండులేదా, మూడు గుడ్లను పెట్టాయి. ఒకకోడి నాలుగుగుడ్లనుకూడా పెట్టింది. ఆ గుడ్లలో ఒక్కొక్కటి 207 గ్రాములబరువు ఉన్నది.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౩౯

అవనిజా స్తన కలశాలింగనంబున
మోదంబులొందుచు మురియువాఁడు
పూర్ణ చంద్రునిబోలు, ముద్దుమోమునుగల్గి
క్షీరాబ్ధిశయనుఁడై చెలఁగువాఁడు
హారపంక్తులతోడ నలరారి, చిఱునవ్వు
జిలుకుచు నానంద మొలుకువాఁడు
రఘువరా! పద్మాక్ష! రమ్యమేఘశరీర!
శ్రీరామచంద్ర! పక్షీంద్రగమన!
భక్త చింతామణీ! రాఘవా! ముకుంద!
శ్రీశ! సీతాపతీ! నరసింహరూప!
నా మనోవీథి వసియించి రామ! నన్ను
రక్ష సేయుము; భజియింతు రక్తితోడ.

౪౦

బృందారకస్తోత్ర! సుందర సుసుగాత్ర!
బ్రాహ్మణవంశ సంరక్షకుండ!
లోకపాలక! బుధలోక మోదితగుణ
చారిత్ర! శ్రీరామ! చారునేత్ర!
ఆదినారాయణా! అఖిలవిద్యానిధాన!
వైదేహిరమణ! శ్రీ వాసుదేవ!
నిఖిలాయుధములందు - నేర్పరివైనావు
వర్ధిష్ణుఁడై, నీవు వఱలినావు
సీత బంగారుబొట్టుగాఁ జెలగుచుండ
మెఱుపు ప్రభగల వస్త్రముల్ - మేనఁదాల్చి
నిత్యశృంగార రసికుఁడై - నీరజాక్ష!
పరగుచున్నావు; శ్రీరామ! వందనములు

౪౧

రఘుపతీ! శ్రీరామ! రావణమర్దనా!
రత్నాకరనివాస! రమ్యహృదయ!
రణజిత పటుభుజ! రాజీవలోచన!
కోటి భాస్కర తేజ! కువలయేశ!
నీలమేఘశ్యామ! నిత్యవిజయకాయ!
వ్యాపకభావ! శౌర్యప్రతాప!
రత్నభూషణదేహ! నూత్నకాంతి విలాస
శ్రీపతీ! భూపతీ! చిద్విలాస!
సీతవశవర్తివైనావు; శ్రీ రమేశ!
ఇంక మాకేమికొదువ? మా పంకజాక్షి
భక్తి భజియింతు మెప్పుడు పరమపురుష!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!

౪౨

తాటకి మర్దించి, తపసి యజ్ఞముగాచి
ముక్కంటి ధనువును జక్కవిఱిచి
దేవతా హితకాంక్ష - దివ్యదశావతా
రంబులఁదాల్చి, శ్రీరామచంద్ర!
దుష్టసంహరణంబు - శిష్టరక్షణము స
ల్పినయట్టి జగజెట్టి - యనఘమూర్తి
పాదధూళి నహల్య పాపంబుఁబోకార్చి
మంగళరూపుఁడై - మహిమఁజెంది
గొప్ప బలముగల్గి - కోదండమును దాల్చి
రక్కసాళియొక్క యుక్కడంచి
మునుల సాధుజనుల - ఘనముగ రక్షించి
బరగినావు; రామ! వందనములు.

౮౩

నీలగాత్రుండ! రాజీవ నేత్రయుగళ!
రామచంద్ర! రఘుశ్రేష్ఠ! రామభద్ర!
పూర్ణచంద్రాస్య! సౌందర్య భూషణుండ!
ప్రీతి పెంపార, నాకుఁ జేయూతనిమ్ము

౮౪

నిక్కుటద్దముబోలు - చెక్కిళ్లుగలవాఁడు
పద్మముఖుండయి, వఱలువాఁడు
గజతుండములవంటి - భుజదండములవాఁడు
గుణసమూహమునకుఁ గోవిదుండు
అధిక తేజస్సున కగ్నికుండమువాఁడు
తీక్ష్ణరూపుండైన ధీరయుతుఁడు
ముల్లోకములమొక్క - మ్రొక్కులందిన వాఁడు
అరుల రూపడగించి, యలరువాఁడు
రామచంద్రుండు నా మనోరాజ్యమందు
స్థిరనివాసంబుఁ జేకొని, చిత్తశుద్ధి
నిర్మలంబుగ నాకిచ్చి నెగడుగాక!
యతని భజియించి, సేవింతు ననుదినంబు.

౮౫

కోదండమును, నీ భుజాదండమునఁబట్టి
శత్రుల ఛేదించు సమయమందు
భూధూళి నీ దేహమును గ్రమ్మె; రణరంగ
మల్లకల్లోలమై - యావహించె
శ్రీరామ! ఇంద్రాది బృందారకులు నిన్నుఁ
బొగడంగ వర్షించెఁ బూలవాన
మలిన దేహముమీద మందారు పుష్పముల్
వర్షింప నీలాభ్రపథమునందు
చుక్కలట్లుతోచె; సుందరాకార! గ
గన సదృశ శరీర! కమలనయన!
బలముగల్గి శత్రుభంజన మొనరించి
నావు; రామభద్ర! కావుమయ్య!

(సశేషము)

---

## శ్రీ అన్నపూర్ణాదేవి మహిళా సంఘం ప్రథమ వార్షికోత్సవము

12_3_1959 తేదిన భీమవరం తాలూకా కోరుకొల్లు గ్రామములో శ్రీ అన్నపూర్ణాదేవి మహిళా సంఘము వారి యాజమాన్యమున సభ జరుపబడి 113 సంవత్సరముల వయస్సుకల శతవృద్ధు యిప్పటికీ కాంగ్రెస్ సేవ చేస్తూన్న శ్రీమతి కోటపర్తి కనకమ్మగారిచే అంబరు చరఖా శిక్షణ కేంద్రము ప్రారంభించబడెను. అంబరు చరఖా ప్రాముఖ్యతను గురించి గ్రూపుఆర్గనైజరు శ్రీ కోడాలి వెంకటేశ్వర్లు అంబరు చరఖా ఇనస్పెక్టరిస్సు శ్రీమతి ముదుండి చెంద్రకాంతమ్మగారు అధ్యక్షత వహించిరి.

శ్రీ అన్నపూర్ణాదేవి మహిళా సంఘము ప్రథమ వార్షికోత్సవము శ్రీమతి జంపన చెంద్రమ్మగారి అధ్యక్షతను జరుపబడెను. సంఘ కార్యదర్శిని శ్రీమతి శ్రీగిరి రత్నమాలగారిచే వార్షిక నివేదిక సమర్పింబడి అంగీకరింపబడెను. సంఘము ప్రారంభించినది మొదలు జరిగిన కృషిని సంఘాధ్యక్షురాలు శ్రీమతి మంతెన లీలావతమ్మగారు వివరముగ తెలియపరచిరి.

మహిళా సంఘముల ప్రాముఖ్యతను గురించి అవిచేయుచున్న కృషిని గురించి శ్రీమతులు గోకరాజు వెంకాయమ్మ, పి సూర్యకాంతమ్మ, దశభాషా ప్రవీణ శ్రీ శర్మ, శ్రీ టి. అప్పారావు, శ్రీ టి. వెంకన్న మున్నగు ప్రముఖులు మాట్లాడిరి. అల్పాహార విందొసంగిన పిదప కార్యదర్శిని సభాభి వందనములతో సభ ముగింపబడెను.

అభిప్రాయములు

# హిందూ సంఘము - వివాహము

—(ం)—

కంచి కామకోటి పీఠాధిపతులు బోధించిన ప్రకారము, వివాహములు, ఉపనయనములు తగు వయస్సులో చేయుటయే మంచిదని, తోచుచున్నది. మరియు చిన్న వయస్సులో కాక కొంచెం బుద్ధి తెలిసీ, కొంత చదువైన తరువాత చేయుటే తగినదని, ప్రస్తుత క్లిష్ట పరిస్థితులనుబట్టి, తెలియుచున్నది.

మొగపిల్లవాండ్ల వడుగులుకూడా, పెండ్లికిముందు నాడు చేయుచున్నారు. ఉపనయనం - అంటే బ్రహ్మోపదేశం, గాయత్రిని జపించుట. ఇది ఎనిమిదవఏట చేయుచుండెడివారు. ఆనాటినుండి బాలునికి ఆధ్యాత్మిక జీవితాభివృద్ధికి మొదలు. ఈ ధ్యానము పరలోక సాధనము.

క్రిస్టియనులు, ముసల్మానులకైనను, వారి వారి మతప్రకారము, రోజు తప్పక ప్రార్థనలు జరుపుకొనునట్లు, మన మతములో నిర్బంధము లేకపోవుట వల్ల శాస్త్రముల పట్ల ఆసక్తి అడుగంటుచున్నవి. నాగరికత హెచ్చినకొద్ది, నాటి సాంప్రదాయములు మూలబడుచున్నవి.

పూర్వము అంటే, పాతిక సంవత్సరముల క్రితం ఆడపిల్లకు పన్నెండేండ్లలోగా, మొగవాండ్లకు ఇఱువై ఏండ్లలోగా వివాహములు చేయుచుండిరి. ఎంతమంది ఆడపిల్లలున్నను, అవయసుకందరికిని పెండ్లిళ్లు జరిగిపోయెడివి. శారదా బిల్లు అమలులోనికి వచ్చిన తరువాత పదునాలుగు సంవత్సరములకు పైన గానీ పెండ్లిళ్లు చేయకూడదనేటప్పటికి, 14-16., 20, 30 సంవత్సరములైనా, ఈ కాలంలో వివాహములు జరుగుట బహుకష్టముగనున్నది. ఎందువలన? చదువుకున్న విద్యావతులకు తగుమైన సంబంధము దొఱకక నా? తలిదండ్రులకు నచ్చిన వరుడు పిల్లకు నచ్చకపోవటం, నచ్చినను వరకట్నము నిచ్చుకొనలేకపోవటం. ఈ విధముగ కాలము జరిగిపోవుచున్నది.

పదిపన్నెండేండ్లకు బాలికలకు పెండ్లి చేయకపోయినా పరవాను, పద్దెనిమిదేండ్లకైనను పెండ్లి చేయటం మంచిది. పైచదువులుచదవవలెనన్న ఆతృతగల బాలికలకు తప్ప మిగతవారికి S. S. L. C పూర్తికాగానే మంచి వరుణ్ణిచూచి పెండ్లి చేయుటుచితము. మంచి వరుడు అంటె మంచివరులు, అందరికి అన్నీ సమకూడినవారు ఎక్కడనుండి వచ్చెదరని సమస్య, పూర్వము ఒక వాడుకమాట యుండెను. తండ్రి విద్యాకుల గోత్రములు, తల్లి సొత్తు, సొమ్ములు పిల్ల సౌందర్యము వరుడు చూచునని చెప్పుచుందురు. ఇవన్నియు సమకూడిన సంబంధం చక్కటిదన్నమాటే!

ఇంకొక సంగతి ఏమన, ప్రేమించి చేసుకున్న పెండ్లిండ్లు విజయవంతములా, పెండ్లి చేసుకొని, ప్రేమించిన వివాహములు విజయవంతములుగ నున్నవా? అని, పాశ్చాత్యులుకూడ ఈ సమస్యనే విచారించుచున్నారు. అకస్మాత్తుగ ప్రేమించి పెండ్లి చేసుకున్న పెండ్లిళ్లు అకస్మాత్తుగనే విడిపోవుచున్నవి. ఉద్రేకముతో వచ్చిన ప్రేమ, ఆ ఉద్రేక మణగగనె, పోవుచున్నటులున్నది, ఇది శారీరక ప్రేమ మాత్రమె.

ప్రేమ, వివాహము, దైవికము, పవిత్రముగా నేటి బాలబాలికలు తెలుసుకొనవలెను. మనసులు కలిసి, దినదినాభివృద్ధిగాంచిన ప్రేమ ఎన్నటికిని, కలుగదు. ప్రేమించునది శరీరము కాదు. సౌందర్యము కాదు - ఆ శరీరములోనున్న ఆత్మనని తెలుసుకొనవలెను. ఇది ఆత్మప్రేమ. ప్రేమయనగా అర్థమేమి? ఆత్మను ఆత్మ ఆకర్షించుట. పెండ్లియనగా ప్రకృతి పురుషుల ఐక్యము.

వివాహమనిన, పశుతుల్యమైన ప్రేమగాక పవిత్ర ప్రేమగా భావించి, ఆధ్యాత్మికముగ విచారణ చేయుచు, ఉన్నతపదవి పొందిన కల్యాణములె, లోకకల్యాణము, సంఘ సంస్కృతియు. ఇటువంటి దైవికదంపతులకు కలిగిన సంతానమె దేశసౌభాగ్యము. గనుక సకాల వివాహములు ఉపనయనములె, దీనికి తోడ్పడునవని నా అభిప్రాయము.

నెమలి చంద్రమతి

—o—

మార్చి "గృహలక్ష్మి" యందలి శ్రీ స్వాముల వారి యుపన్యాస విషయమగు "హిందూసంఘము-వివాహము"ను చదివితిని. శ్రీ స్వాములవారి అభిప్రాయములను సావధానముగా నాలోచించిన కొంత యాశ్చర్యము గలుగకమానదు. శ్రీవారు బాలికల వివాహముల విషయ ప్రస్తావనలో నేడు 20, 30 ఏండ్లు వయస్సు గలిగినను వివాహముకానివారుండుట శారదాచట్టనిర్ణయ ఫలితమని వ్రాసుచ్చి యున్నారు. వారి యుద్దేశములతో నేకీభవించవలయునవిన కొంత తర్జన భర్జనలమీదనైనను వ్యతిరేకము కాక తప్పదు. పూర్వము వివాహము లెంత చులకనగా చూడబడినవో, వాటికి యెంత విలువ యిచ్చినారో తెలిసికొనుటకు నొక యుదాహరణముగ జరిగిన సత్యమును దెలుపుదును. మా వంశమందునే జరిగినకాలమందు మా తండ్రిగారి తండ్రి తల్లికి, ఆరునెల్ల వయస్సునందు, ముప్పదేడుల పురుషునితో వివాహము జరిగినది. ఇది జరిగిన సత్యమే గదా! ఇలాంటి విషయము విన్నప్పుడెంత సంతోషమో ఆలోచించుడు! ఆరునెల్ల వధువు, ముప్పదేడుల వరుడు! ఆ జటను ఆ నాటి సంఘము మెచ్చికొన్నదే! అది న్యాయమైనదేనా! కన్నులు తెలియని పసిపాపలకు పవిత్రమైన వైవాహిక ధర్మము పైరైన తెలియకుండ పెండ్లిచేసిన అది పెండ్లియేనా! ఇలాంటి వనేకములు గలవు. ఇట్టి అమానుష కృత్యములనెదిర్చి రూపొందిన శారదా చట్టము, యిలాంటి మచ్చనొందుట సర్వత్రా విచారించవలసిన యంశము. వారు బాలికల వివాహమున క్రీడు ఎనిమిదినుండి పంద్రెండేండ్లని నుడివినారు. ఆ వయస్సునుబట్టి ఆలోచించ 8-12 సం॥ల మధ్యగల బాలికల శారీరక మానసిక పరిస్థితు లెలాగుంటవో ఆలోచించవలసి యున్నది. వివాహము "నూరు కాలములపంట" కాని బొమ్మలపెండ్లి గాదు.

భార్యాభర్తలిరువురు, తమ తమ భావిపరిస్థితులను సుస్థిరమగు బునాదులు వేసికొని యొకరినొకరు అర్థముచేసికొని వర్తించినగాని వివాహ ప్రయోజనము గనిపించదు. జీవిత సమస్యయగు వైవాహిక విషయమునందు స్త్రీ పురుషు లిరువురును భాగస్వాములు. పూర్తి యంగీకారములైన బిదపనే వివాహమాడుకొన్న యువతీ యువకులు, సంసారయాత్రయందెన్ని కష్టములు గలిగినను, మనసారవలచి, వలపించుకొన్న వారలగుటచే యోర్పు వహించి సాగించగలరు. భర్తయన నెవరో, తనకును భర్తకును గల సంబంధమెట్టిదో ముందుగా స్త్రీ అర్థము చేసికొనవలయును. అట్లు అర్థము చేసికొనుటకు తగిన వయస్సు రావలయును. అనగా యుక్తవయస్సు నందుగాని యట్టి విచక్షణ, వివేకములు గలుగవు.

ఊరకనే వ్రాతనియమములని, స్వామివారి యాశయముల ప్రకారము చూచిన సద్విషయములకు దావుండదు. స్త్రీ బానిసగా సంఘమందొక హృదయశూన్యమగు బనిముట్టువోలె జీవితము వెళ్ళబుచ్చవలసినదే. పూర్వ సిద్ధాంతములనుబట్టి యింకనుమీద, స్త్రీ విద్యకు దూరురాలు, స్త్రీ సంఘమునకును, వ్యక్తిత్వమునకును తక్కువయని పెద్దలు గట్టడిచేసియున్నారు.

పరలోక విషయ మెట్లున్నను, పుణ్యపాపఫలము లెట్లున్నను మందు, ఇహలోకయాత్ర సుఖకరము కావలసియున్నదిగదా! నేడు, ఏండ్లు వచ్చినను అవివాహితలుగా స్త్రీలున్నారను విషయము పరిష్కరించవలసి యున్నపుడు ముఖ్యముగా పురుషుల మన స్తత్వమార్పిడి, సంఘకటకటాల విచ్ఛేదన మావశ్యకము. యువకులు తమ చదువులను విజ్ఞానముతో జోడించి, కట్నకానుకల కోరికల కతీతులు కావలయును.

ఇక స్వాములవారు శెలవిచ్చినట్లుగా, వితంతు వివాహములను వ్యతిరేకించిన భావము మిక్కిలి చోద్యమనక తప్పదు. "పూర్వకాలమున హిందూ కుటుంబములో వితంతువు భారంగాగాక ఆస్తిగా నెంచబడుచుండెడిది." అనే భావంలో సత్యం యెంతైనాయుంది. దురదృష్టవశాత్తు భర్తను గోల్పోయిన స్త్రీ లెంత నీచంగా సంఘంలో చూడబడుతున్నారో యనే విషయాన్ని స్వాములవారు కన్నెత్తయినా చూడలేదు గాబోలు. వారు చెప్పినట్లుగా, యింటిలో యిరువురు లేక ముగ్గురు వితంతువు లుండిన, ఆ యింట్లోయున్న కుటుంబ యజమానులు పిత్రార్జితములగు ఆస్తిపాసులమాదిరి, వాళ్ళనుగూడ పంచుకొనుట మనమిప్పటికిని చూచుచున్నాము. ఈ విధముగా ఆస్తిగా నెంచబడుట వితంతువులమీద గరుణవల్ల కాదు; యెట్టి చాకిరికి పనికివచ్చు సేవకురాలుగా చేసికొనెందుకు మాత్రమేయని గమనించాలి. దురదృష్టవంతురాలగు వితంతువు కష్టభూయిష్ట జీవితములకు కన్నీరు కార్చవలసియుండె. ఆధ్యాత్మికమును మత్తు మందులతో స్త్రీ హృదయాన్ని గాయపఱచే వారలకు వితంతు పునర్వివా

హము అంగీకారముగాకపోవచ్చును. న్యాయసమ్మతముగా, విశాల దృక్పథంలో, సంకుచిత కులమత వ్యవస్థల కతీతదృష్టిలో చూచిన నిట్టి విపరీత భావములను దిద్దుకొనక తప్పదని గుర్తుకు తెచ్చుచున్నాను.

మతములు మానవ కల్పితములేగాని భగవన్నిర్ణయములుగావనియెడిది స్పష్టము. సత్యము. నోరుగల వాళ్ళు, గాలివాటున వారి వారిష్టముల ప్రకారము తమకు వీలున్నంతవరకు సంఘాన్ని పాడుచేశారు. ప్రతి మతముగూడ స్త్రీని బానిసగానే చూచింది. స్త్రీ వివేచనా శక్తికి విలువలేదు. ఒక పురుషుడధిక సంఖ్యాకులగు స్త్రీలను వివాహమాడటంలో పరదాచాటునగల రహస్యం కొంతవరకు గనబడక తప్పదు. ఏ స్త్రీ అయినా తను వలచిన పురుషుడు మరియొక స్త్రీతో భాగస్వామ్యుడన్న సంతోషించ గలదా! అది జరగని విషయముగదా! మొదటి నుండియు సంఘములో స్త్రీకియున్న గడ్డుపరిస్థితుల వల్లనే, మూర్ఖులగు తల్లితండ్రుల ధనాంకాంక్షవలననే యొక పురుషుడు పెక్కురు స్త్రీలను భార్యలుగా జేసికొనుట జరిగినది. మన హిందూమత మందలి పురాణములందు బహు భార్యాత్వములేదా! ఏదో పిచ్చిగా యొక మతమని, దాన్ని రాజ్యాంగమునకు ముడిపెట్టుట పనికిరాని విషయము.

ఎన్నాళ్ళనుండియో, స్త్రీల విషయంలో తీరని యపకారంచేసి కుళ్ళబెట్టబడిన సంఘాన్ని, సంఘ దౌర్జన్యాన్ని, సంఘ వికృత పైశాచిక చర్యలను అరికట్టవలదా! స్త్రీల నుద్ధరించుటకుగాను పాటుపడుచున్న సేవాసదనంలాంటి సంస్థలు, స్త్రీల దైన్యావస్థను శాశ్వతంగా బహిష్కరించలేవనుటలో యుద్దేశ్యం నావంటివారికి బోధపడదు. "చెట్టునకు నీరు పైన పోయరాదు. అడుగునపాదులో పోయవలయును" అనే స్వాములవారి వాక్యము, అన్ని విధాల మంచిగానున్న వృక్షముల విషయంలో చెల్లుబడియౌనుగాని, పురుగులుబట్టి, చీడల నిండియున్న చెట్టు విషయంలో పనికిరాదు. చెడిపోయిన చెట్టు భాగాన్ని అవసరమైతే తీసివేసి తగు జాగ్రత్త తీసికొనవలయునుగాని, ఊరక అడుగున నీళ్ళుపోయుచుండిన చెట్టెంత శోభాయమానంగా పెరుగుతుందో ఊహిస్తే తెలుస్తుంది. ఒకవేళ శ్రీ వారు శెలవిచ్చినట్లు అలాంటి పరిస్థితుల్లోనైనా పాదులో పోయమన్నట్లు, చీడపురుగుల పోగొట్టు ద్రావకారం మొదట్లో బోసిన యెడల చెట్టు మొత్తము ఎండుకట్టెలకు పనికివచ్చునన్న విషయము మఱువరానిది. అట్లే నేడు సంఘములో, క్రుళ్ళు కడుగుటకు సేవాసదనములెంతేని యవసరము. స్త్రీ జనాంగమునకు విజ్ఞానామృతాన్నిపంచే "గృహలక్ష్మి" లాంటి పత్రికలెంతేని ముఖ్యము.

ప్రతి స్త్రీయును భర్తను దేవుడులాబూజిస్తుంది. అతని సేవలో ఆనందిస్తుంది. తనజీవితం సౌఖ్యవంతం కావలెననుకొంటూ కన్నకలలను ఆచరణలోకి తెచ్చుకొంటుంది. కానిబుద్ధిహీనతగా, మానవత్వానికి దూరంగాయుండే భర్త విషయంలో అవసరమైనప్పుడు, యెదిర్చి సన్మార్గమునకు త్రిప్పుకొని శాశ్వత సుఖమునందుటలో స్త్రీ చేసినను, తప్పుగా నెంచరాదు. ఆధ్యాత్మిక జీవితం స్త్రీ కెంతవఱకుపయోగపడుతుందో, ఎంతవఱకు దాననుసరించాలో స్త్రీ నిర్ణయించుకోగలదు. అంతేగాక మనమొక విషయమునుగూడ ఆలోచించవలసియుంది. భగవంతుని దృష్టిలో అన్ని జీవులు సమానమనుచుండే యీ ఆధ్యాత్మికవాదము, స్త్రీల విషయంలో అవసరమైన హక్కులనైనా నివ్వని కారణంయేమిటో స్వాములవారిలాంటి ఆధ్యాత్మికవాదులకే తెలియాలి. భగవంతునికి ప్రతివ్యక్తి సదా జంకుచుండునేగాని, భగవంతుని దృష్టికే భంగకరముగ చెట్టు పేరుచెప్పుకొని కాయలమ్ముకొను పెద్దలకుమాత్రం యెవ్వరూ జంకరాదు. ఏ స్త్రీ జంకకూడదు.

"ప్రతిదాన్ని భగవంతుడేయిస్తున్నాడు తీసుకొంటున్నాడు" అనేభావంమంచిదే. కొంతవరకు మనసుకు తృప్తి నివ్వటానికి మత్తుమందుగా పనిచేస్తుందికాని మానవుడు తనకొస్తున్న రోగములను, కష్టాలనెదుర్కొని తప్పుకోవాలని ప్రయత్నించటంగూడా ఆధ్యాత్మిక దృష్ట్యా దోషమే గదా! మరి మానవుడేల తాపత్రయపడతాడు! అలాగే సంఘంలోని క్రుళ్ళుకు, ప్రాతనమ్మకాల్లోని బూజును, ప్రతివారు నిర్భయంగానెదిర్చి, రూపుమాపవలసిందే. అందులో తప్పు యేమాత్రములేదు.

ఆ సహజవ్యక్తిత్వములు, సంఘటలనుబట్టి పురాణములను హీనముగా చూడరాదనే వారిభావం స్వయంగా లేనిదోషాన్ని చెప్పుతున్నట్లయింది. మంచిచెడ్డల ప్రధానముల నేవి నగ్నసత్యం. పురాణంలు జరిగినవి యదార్థములనే అంటారుకాని, అవి ఆ

రోజులల్లో తగిపోయినవి అందువల్ల ఆకాలంలో వాటి ఆటసాగింది. కాని అందువల్ల మనం అసహజ వ్యక్తిత్వములనటం సబబుగాదు. మంచి అనేదికాలానుగుణ్యంగా చెడ్డకావొచ్చు. చెడ్డనేదిమంచిగా మారొచ్చు. చన్నీళ్ళస్నానము ఏండాకాలంలో హాయినిస్తుంది. కానీ వానకాలములో చలికాలములో సుఖమునివ్వదు. అంతమాత్రములో చన్నీళ్ళస్నానము హాయినిచ్చునది కాదందురా? అబలల విషయంలో అనేకం అడ్డంకులు అడ్డు తగిలి పురోభివృద్ధి నెదుర్కొంటున్నవి. వాటిని బుద్ధిమంతులైన పెద్దలు, యువతీయువకులు డొంకలను ముళ్ళను తీసి చక్కటిరాచమార్గాలనేర్పరచుకోవాలి.

అబ్బరాజు శ్రీనివాసమూర్తి

—(o)—

# విశిష్టమైన శిల్పఖండాలు

కుంభకోణం సమీపాన దారాసురం దేవాలయంలో నొక చోట సంగీత స్వరాలు పలికే సోపానాలున్నవి.

సింహాచలంలోని శివాలయంలో శిల్పాలు శ్రుతి పేయమైన స్వరాలను పలుకుతాయి.

ఆంధ్ర ప్రదేశ్‌లోని లేపాక్షి తాడిపత్రి ఆలయాలలో ఒకే స్వరంపలికే స్తంభాలున్నవి. ఇలా కాక ఒక స్తంభాన్ని కొడితే దాని చుట్టు ప్రక్కలనున్న యితర స్తంభాలు సయితము అదే స్థాయిలో కంపించి స్వరాలు పలుకుతాయి.

చంపకదణల్లూర్‌లోని శివాలయంలోగల నొక స్తంభములో వేణువు నేమలచారనిపిస్తుంది. ఒక్కొక్కరంధ్రంలో ఒక్కొక్క స్వరం ఆవిర్భవిస్తుంది.

మధురలోని రతీదేవి విగ్రహముయొక్క ఎడమముంజేతి మణికట్టుమీద, దక్షిణహస్తముమీద కొడ్తే కర్ణాటక సంగీతములోని షడ్జము, రిషభ, గాంధార స్వరాలు పలుకుతాయి.

తంజావూరు వెరుంతోట్టం గ్రామంలోని ఆదికేశవ దేవాలయంలోని విష్ణువిగ్రహం యిరవైనాలుగడుగుల ఎత్తుగలదై పంచలోహాలు పోతపోయబడింది. చిన్నలోహపు కణికతో యీ విగ్రహం మీద నిర్ణీతస్థానాలలో కొడ్తే సప్తస్వరాలు శ్రవణానందంగా వినిపిస్తాయి.

---

ఏ గ్రామానికాగ్రామము ఆహారధాన్యాలను పండించి స్వయం పోషకంకాకలుగడం వాంఛనీయం. దానికంటె ఏ గ్రామానికాగ్రామం నూలువడికి, గుడ్డను నేసికొనడం వాంఛనీయమే కాక దానికి కావలసిన మొత్తము ఆహారధాన్యమును పండించుకొనుటకంటె సులభము.

బాపూజీ

# రాజకుమార్

ఫ్రెంచి మూలం : ఆంటోని డెసయింట్-ఎక్సుపెరే

ఆంధ్రానుసరణ : డాక్టర్ వి. ఎస్. శర్మ



## గ్రహమండలాలలో ప్రయాణము

[మరో గ్రహమండలంలోనుంచి మన గ్రహమండలంలోకి వూడిపడివచ్చిన అబ్బాయి మన కథానాయకుడు రాజకుమార్. ఎడారిలో దారీ తెన్నూ తెలియక కంగారుపడుతూ వున్న ఒక పైలట్‌తో రాజకుమార్‌కి పరిచయమైంది. అబ్బాయికి కబుర్లు చెప్పటమంటే సరదా. ఇలాటి పరిస్థితులలో పైలట్‌కి ధైర్యం, సాహసం ఇచ్చేవి ఇవేగా! ఒక రోజున పైలట్ ఒడిలో పడుకుని తను గ్రహమండలాలని చూడటానికి బయలుదేరినప్పుడు, దోవలో తను చూసిన అద్భుత దృశ్యాలను, విశేషాలను తన స్నేహితునికి చెప్పటానికి ప్రారంభించాడు. అబ్బాయి ప్రప్రథమమున చూసింది ఒక రాజు నివసిస్తూవున్న గ్రహమండలం. తరువాతి కథ ఇప్పుడు నడుస్తుంది.]

### I

ఆ రాజకుమార్ ఒక్క రాజుగారు నివసిస్తూవున్న గ్రహమండలం చూడటంతో తృప్తిపడ్డాడుకాదు. మరికొన్ని గ్రహమండలాలని చూస్తూ అక్కడి వింతలను, విశేషాలనూ తెలుసుకోవాలని వుబలాటపడ్డాడు. ఇక ఒకచోట నిలకడగా కూచుండే ఘటం అయితేగా అలాటి కోరికలు అబ్బాయి బుర్రలో రేకెత్తుతూ వుంటే! ... ...

రాజుగారి దగ్గర సెలవు పుచ్చుకుని మరో గ్రహమండలంలోకి తిన్నగా ప్రవేశించాడు. ఇందులో నివసిస్తూవున్న ఆయన దంభాచార్యుడు. ఆయనకున్న ఆస్తిపాస్తులు కొద్దే! వాటిని తన డాబూదర్పానికి ఎలా వుపయోగించాలని కలలు కంటూ వుంటాడో ఆ సంగతి చెప్పితేనా ఇక దానికి అంతూ పంతూ అనేది వుంటుందా? .... కాని ఆయన గొప్పదనాన్ని చూసి ఆశ్చర్యపడటానికి నరపురుగు అటుకేసి వచ్చేపాపానపోతేగా!

రాజకుమార్ ఆయన దగ్గరకు రావటం ఆయన దూరాన్నుంచే చూశాడు. "ఇవ్వాళ సుదినం. నా గొప్పదనాన్ని చూడటానికే ఆ మనిషి ఇటూ వస్తూ వున్నాడు" అని తనలో అనుకుంటూ వుబ్బి పొంగిపోతూ వున్నాడు. అబ్బాయి ఆయనను సమీపించటమే తరవాయి, ఆయన చేసిన అతిథి సత్కారం సంగతి ఇక మాటలతో చెప్పటం అవసరమా? ఆ బ్బాయి ఇదంతా చూస్తూ విస్తుపోతూ వున్నాడు.

"నిజంగా నన్నుచూసి అంత ఆశ్చర్యపడుతున్నావా?" గర్వంగా అబ్బాయిని ఆయన ప్రశ్నించాడు.

"ఆశ్చర్యపడటం అంటే ఏమిటి?" అని ఆయన అడిగిన ప్రశ్న అర్థంకాక అబ్బాయి ఆయన్నే ప్రశ్నించాడు.

"ఆశ్చర్యపడటం అంటే ఇతర్లు నా గొప్పతనాన్ని తెలుసుకున్నారన్నమాట. నేను సామాన్యమైన మనిషినయితేగా!

నా అంత భాగ్యవంతుడు, తెలివితేటలు కలవాడు, అందగాడు ఏ లోకంలోకూడా లేడని చెప్పవచ్చు. అంచేతనే నన్ను చూసి ఇతర్లు ఆశ్చర్యపడాలి ...'' అని డాబూ దర్జాతో ఆయన అన్నాడు.

''అయితే ఇక్కడ ఒంటరిగా ఎందుకు వుండటం ?'' అని సూటి ప్రశ్నను విసిరి వేశాడు అబ్బాయి.

''ఆ గొడవంతా నీ కెందుకువచ్చె! .... నన్ను చూడు - ఆశ్చర్యపడు. అదే నాకు కావాలి .... '' అని అట్టహాసంతో తను వేసుకున్న టోపిని చేతిలోకి పుచ్చుకుని అన్నాడు. ఇటూ అటూ తడుతూ

''అలాగా ! ఇదంతా చూస్తూవుంటే నాకూ ఆశ్చర్యంగానేవుంది .... కాని ఇంత డాబూ దర్పమూ అవసరమా ?'' అని భుజాన్ని ఎగరవేస్తూ అక్కడినుంచి చప్పున బయలుదేరాడు. లోకంలో రకరకాల మనుష్యులు వుంటారు. వారికి అంటివుండే వాతావరణంకూడా ఆ కోవలోనే వుంటూ వుంటుంది అనుకున్నాడు, అబ్బాయి అక్కడ రాజుగారి దర్బారులో చూసిన వింతను, ఇక్కడ ఈయన దగ్గర వున్న డాబూ దర్పాన్ని తలబోస్తూ ..

II

రాజకుమార్ ఇంతవరకు చూసిన వాటితో నిరాశపడ్డాడా ? గ్రహమండలాల లోతు పాతులని క్షుణ్ణంగా తెలుసుకోవాలని ఆ దంభాచారి గ్రహమండలంనుంచి ఇంకొక మండలంలోకి ప్రవేశించాడు. ఇది అంత చెప్పుకోదగ్గ గ్రహమండలం కాదు. ఇందులో వుంటూ వున్నాయన త్రాగుబోతు. అహో రాత్రాలు బుడ్డి ఆయన చేతులోనేవుండితీరాలి. నిండు బుడ్లని ఒక్క నిమిషంలోనే మాయంచేయటంలో ఆ మనిషికి పెట్టిందిపేరు. అంత త్రాగుతూ వున్నా సంతోషం అనేది ఆ మనిషికి బొత్తిగాలేదు. ఎప్పుడూ ఏదో విచారంలో తేలుతూ వుక్కిరి బిక్కిరయిపోతూ వుంటాడు. ...

అబ్బాయి ఈ దృశ్యాన్నంతా చూస్తూ విచారపడుతూ ''ఎందుకిలావున్నావు ?'' అని ఆ త్రాగుబోతుని ప్రశ్నించాడు.

''ఎందుకా ? ఇలా త్రాగుతూవుంటే ...'' అని ఏదో చెప్పబోతూ, తడబడుతూ వున్నాడు.

''ఎందుకిలా త్రాగటం ?''

''మరచిపోడానికి.''

''మరచిపోడానికంటే ?'' ఆయన జవాబుకు విస్తుపోతూ రాజకుమార్ ప్రశ్నించాడు.

''చేసిన దానికి సిగ్గుపడవద్దూ ? అంచేతనే దానిని మరచిపోవాలని .... '' తలని వేలవేస్తూ అన్నాడు ఆ మనిషి.

''అంత సిగ్గు పడాలసివచ్చిన దాన్నేం చేశావు ?''

దానికి ఆయన జవాబిస్తేగా ! గడగడ వణకిపోతున్నాడు. కన్నీటి ధార. .... మౌనమే మంచి జవాబు అనుకుంటూ వున్నాడు కాబోలు !

ఈ దృశ్యాన్ని అబ్బాయి చూడలేక పోయాడు. ఇలాటి మనుష్యులుకూడా వుంటారు కాబోలు అనుకుంటూ గబగబ అక్కడినుంచి వెళ్లిపోయాడు.

(సశేషము)

# నిమ్మయ్య - ధర్మయ్య

శ్రీ సి. సి. పున్నయ్య



ఆయనను ఆ యూళ్లో ఆరణాల మూడణాల నిమ్మయ్య అని పిన్నలు, పెద్దలు వెంటబడి బజారులలో పిలుస్తూ గోలచేస్తుంటే చీకాకుతో వారిని తిడుతుండేవాడు, కొట్టబోయేవాడు. అయినా నవ్వుకుంటూ ఆయన కనుపించినప్పుడల్లా వెంటబడుతుండేవారు. నిమ్మయ్య ఎవరో, ఎక్కడినుండి ఆ గ్రామానికివచ్చి స్థావరమేర్పరచుకున్నాడో ఎవరికీ తెలియదు. ఆయన ప్రతిదినం ఉదయం భిక్షాటనమునకు యూళ్ళో తిరిగేవాడు. పెళ్ళిళ్ళలాంటి శుభ కార్యాలు జరిగే చోట్లకు, పితృకర్మలు జరిగేచోట్లకు సంభావనకని, భోజనానికని వెళ్ళుతుండేవాడు. తృణమో, ఫణమో యిచ్చింది తెచ్చుకునేవాడు. కాని పాపం తన సంచిలో దాచుకున్న బియ్యాన్ని, డబ్బులను ఎవరో ఒకరు దోచుకుంటుండేవారు. అలా పోగొట్టుకున్నప్పుడు పసిపిల్లవాడిలాగ వెక్కి వెక్కి ఏడ్చేవాడు. కాని పోయినవే అనే బెంగతో కుప్పకూలిపోయేవాడు కాడు. అతనిని చాలమంది పిచ్చివాని క్రింద, వెర్రివాని క్రింద జమకట్టేవారు. ఎవరేమనుకుంటున్నా ఆయన లక్ష్యపెట్టేవాడు కాడు. ఆయన వల్ల ఏదైనా పరుల కుపకారముండేదే గాని అపకారమంటూ యుండేది కాదు. ఎవరితోను అతిగా మాట్లాడేవాడు కాదు. పరిమితంగా ఎప్పుడైనా ధోరణిగా భగవత్, పారమార్థిక చింతలను గురించి నడమంత్రపు లోకంపోయే వింత పోకడలను గురించి మాట్లాడుతుండేవాడు. ఉదయం భిక్షాటనంచేసివచ్చి శ్రీ సాయిబాబా ఆలయం ఆవరణలోని బావి దగ్గర స్నానంచేసేవాడు. బాబా సాన్నిధ్యంలో గంటలు తరబడి ధ్యానసమాధిలో గడిపేవాడు. మామిడిచెట్టుక్రింద వంట చేసికొని భగవదార్పితంచేసి తాను భుజించేవాడు. రాత్రిళ్లు పగలు వండుకున్నది మిగిలితే తినేవాడు; లేకపోతే నిరాహారిగానే పడుకునేవాడు. ఆ ఆలయంలో పూజ, దీపారాధనల నిర్వహిస్తున్న ధర్మయ్య నిమ్మయ్యకు అత్యంత ఆప్తుడు. వారిరువురు సాయిబాబాను లోకకళ్యాణాన్ని, ప్రజల శ్రేయోసౌభాగ్యముల నుద్దేశించి ఆరాధించి, బాబా విభూది ప్రసాదములను, ఆశీస్సులను ప్రతి గురువారం అక్కడ గుమికూడే అశేష ప్రజానీకానికి పంచిపెట్టేవారు. ధర్మయ్య త్యాగసేవాసక్తి, భగవత్ చింతలు ప్రజలలో నిరంతరము పారమార్థిక చింతను, భక్తి ముక్తి మార్గాలను, సౌశీల్యమును ప్రబోధించుచుండేవి. బాబా సన్నిధిలో ధర్మయ్య చేతి విభూది వేలకొలది ప్రజలకు శారీరక, మానసిక వ్యధలను బాబా అనుగ్రహమువలన స్వస్థతపరచేవి. ధర్మయ్య నిరాడంబర జీవి. సత్యశీలుడు. స్వార్థత్యాగి. మానవసేవ నిమిత్తము తన జీవితమును అంకితము చేసినవాడు. ఆయన దృష్టిలో అందరు సమానులే. అధికార ఆధిక్యతల కతీతంగా పీడిత మానవకోటికి వారి సౌభాగ్యము నుద్దేశించి శక్తివంచనలేకుండా బాబా ఆశీస్సుల నందిస్తూ సేవచేయడమే ధర్మయ్య పవిత్ర లక్ష్యము. ధర్మయ్య, నిమ్మయ్య ఒక యూరివారేమో ననుకునేవారా ప్రాంతీయులు కొందరు. మొత్తంమీద చాలకాలం వారిద్దరి పూర్వచరిత్ర ఎవరికీ తెలియదు. నిమ్మయ్య చనిపోయాడా గ్రామంలోనే. ధర్మయ్య ఆయన శవాన్ని ఆలయ ఆవరణలోనే సమాధిచేయించి నిత్యదీపారాధనతో పూజాపుష్పాలు భక్తి విశ్వాసాలతో అర్పించసాగాడు. అదిచూచి ప్రజలు మరీ వింత పడసాగారు. నిమ్మయ్య, ధర్మయ్యలకు పూర్వసంబంధమేదో యుండియుండాలనియు, వారి పూర్వచరిత్రను తెలిసికోవాలని భక్తులకు ఆసక్తి ఎక్కువయింది. దానికనుగుణ్యంగా ఒక చిన్న పుస్తకంవ్రాయ పూనుకున్నాడు యిలా—

"ఒకప్పుడు మాకు ఆస్థిపాస్తులు విశేషంగా నుండేవి. దాన్ననుసరించి మా నాన్న సంసారాన్ని దర్జాగా, దర్పంతో నడిపించేవాడు. నేను ఒక్కొక్క తరగతిలోను రెండు మూడుసార్లు దండయాత్రలు చేసినా బోలెడంత డబ్బు వెదజల్లి చదువు చెప్పించి నేను బి. ఏ. అనిపించాడు. మా అక్కకు, చెల్లెళ్లకు గొప్పగా కట్నాలిచ్చి వైభవంగా వివాహం చేశాడు. మా నాన్న మహారాజా పోకడలకు మా ఆస్తిపాస్తులు కర్పూరంలాగ కరిగిపోయినవి. మా నాన్నకు వయస్సుమీరింది. నాకు ఆశించినట్లు పెద్ద

ఉద్యోగమేది లభించలేదు. ఒక ఫ్యాక్టరీలో చిన్న గుమాస్తాగిరి దొరకడమే గగనమయింది. ఆదాయం స్వల్పం. ఖర్చుతగ్గినదేమి లేకపోయేసరికి చుట్టూ అప్పులు పెరిగిపోసాగినవి. ఆస్తిపాస్తులు సన్నగిల్లినా, ఆదాయం చెప్పుకోతగ్గది కాకపోయినా మా నాన్నకు మునుపటి మంచిరోజులనాటి ఠీవి, దర్జాలమీద ఆసక్తి తగ్గిందికాదు. మునుపటిలాగే దాసదాసీజనం, రోజూ నాలుగయిదు సార్లయినా కాఫీఫలహారాలు, వచ్చే పోయే బంధువుల రాకపోకలు - వీటికని అవకాశ మున్నచోటునల్లా అప్పుచేసేవాడు. కాని ఆ యప్పులు తీర్చడానికి ఎటుపారచూచినా అవకాశాలు శూన్యం. క్రమంగా అప్పులవాళ్ళ ఒత్తిడి అధికమయి మా నాన్న భయపడి యిల్లు కదలడం మానేశాడు. నా స్వల్ప ఆదాయం మా నాన్న దర్జాల ముందర ఆగేదికాదు. ఒక కాని డబ్బు అప్పుకూడ వూళ్ళో ఆస్కారం లేకపోయింది. భోజనానికి జరుగుబాటు సయితం కటకటలాడసాగింది. జీతం, బత్యం లేకుండా ఎంతకాలమని వెట్టిచాకిరి చేయగలమని యింట్లోపని వాళ్ళు నిలిచిపోయారు. పాలవాళ్ళు, నెయ్యివాళ్ళు కాయగూరలవాళ్లు తమ కెప్పటినుంచో యివ్వాల్సి యున్న పైకమునకు కాలిన బలపము కట్టుకొని తిరుగుతుంటే యూళ్ళోని చిన్న, పెద్దకూడ అనేక రకాలుగా మా నాన్నను గురించి, మా కుటుంబాన్ని గురించి మాట్లాడుకుంటుండేవాళ్లు. నాకది అవమాన మనిపించినా నేను చేయకలిగినది ఏమిటో బోధపడేదికాదు.

నేను ఆఫీసుకు పోతూవస్తుండేవాడినే కాని అంతా నాకు అయోమయంగా నుంటుండేది. నారాయణ స్వామి మా ఆఫీసులో అటెండరుగా నుంటుండే వాడు. నన్ను, నా కుటుంబ పరిస్థితులను క్రమంగా అర్థంచేసికోకలిగాడు. దైవికంగా అతనికి నా పట్ల ప్రత్యేకమైన ఆసక్తి, సానుభూతి ఏర్పడినవి. మా కుటుంబ జీవయాత్రలో పొయిమీదికి, పొయిక్రిందికి లేని రోజులు ఎన్నో గడుస్తుండేవి. మేము తిన్నామో, తినలేదో మా చుట్టూయున్న అయినవారికి, కాని వారికీకూడ తెలిసికోవాలనే అగత్యముండేదికాదు. ఆఫీసులో నా వాలకాన్ని చూచి నారాయణస్వామి మాత్రం సానుభూతి చూపేవాడు. ఆయన పదులు, యిరవైలు యిస్తేనే మేము గంజిత్రాగిన రోజులు చాల యున్నవి. నాకు నిస్పృహ నిరాశ లావరించినప్పుడు ఆయన ఓదార్పే నాకు ఆత్మవిశ్వాసాన్ని, బలాన్ని సమకూరుస్తుండేవి. నాకాయన అలా ఎంత డబ్బిచ్చాడో ఆయనకు లెక్కుంటూలేదు; నాకు బాగా జ్ఞాపకములేదు.

నారాయణస్వామికి ఆఫీసులో జీతం స్వల్పమయినా పిల్లజల్లలేదు. భార్య పాడిచేసిపాలు, పెరుగు, నెయ్యి అమ్ముతుంది. విస్తళ్లుకుట్టి, అప్పడాలు, వడియాలుచేసి అమ్ముతుంది. నారాయణ స్వామి జీతంతో పాటు భార్య కృషివల్ల సమకూరే ఆదాయింతో ఒడిదుడుకులు లేకుండా సంసారం గడుపటమే కాకుండా నాలుగు డబ్బులు మిగుల్చుకునే స్థితివారిది. నారాయణస్వామి నాకవసరంవచ్చినప్పుడల్లా వెనకేసుకున్న డబ్బులోనుండి ఆయాచితంగా నాకిస్తుండేవాడు. అంతే తనిచ్చిన డబ్బును తనకివ్వమని నన్ను అడిగి ఎరుగడు.

జీతబత్యాలు లేని కొలువంటూ మా యింట్లోని పనివాళ్లు చాలించుకున్నారు. మాయింట్లో ఆడవాళ్లు ఎవరూ బావిదగ్గరకు పోయి నీళ్లు తెచ్చి ఎరుగరు అంతవరకు. పనిమనుషులు చాలించుకునేసరికి యింట్లో బండెడు చాకిరి ఎవరుచేసేటట్లు? మా అమ్మగువ్వలాగ యింట్లో ఒక మూల కూర్చున్నది. మాచెల్లెళ్లు తమకేమి సంబంధములేనట్లు నిద్ర ముఖాలతో వాల్చినమంచాల మీద బయిటాయించారు. ఇంట్లో చెంబెడు నీళ్లులేవు - అంట్లతప్పాలలు, చెంబులు ఎవరు తమ్ముగమనించలేదేమో యన్నట్లు వంటయింట్లో పడియున్నవి. ఇల్లు చిమ్మటానికైనా ఎవరికీ ఆసక్తి కనుపించలేదు. ప్రొద్దుపొడిచేసరికి కాఫీనీళ్ళకు తపించి పోయే మా నాన్న, అమ్మ, చెల్లెళ్లు అవకాశం ఎలాగూలేదుకాబట్టి కాబోలు కుక్కినపేనులలాగ యూరకున్నారు. ఇదంతా చూస్తున్న మాఆవిడ బిందెచంకనబెట్టి నీళ్ళకుబావికి బయలుదేరింది. మానాన్న అదిచూచి "పంతులుగారి కోడలివైయుండి నీవు నీళ్ళకు పోవడం నా పరువు ప్రతిష్టలను మంటకలుపడానికా!" అని గర్జించాడు.

మెల్లగా మా ఆవిడ "ఇందులో అప్రతిష్టకేమున్నది మామగారూ! మనయింటిపనులను మనం చేసికోకపోతే మరెవ్వరుచేస్తారు!" అంటూ వెళ్ళి నాలుగు బిందెల నీళ్లు తెచ్చి, అంట్లు, చెంబులు తోమి. కాఫీపెడ్తున్నంతసేపు మా నాన్న ఏదో సణుగుతు నేయున్నాడు. అందరికి లోటాలలో కాఫీ పోసియిచ్చి, తాను త్రాగి కాఫీ సామానులను కడిగి గుడ్డలుతకసాగేసరికి మాచెల్లెళ్లు ఒకరి ముఖంమరొ

కరు మాచుకుని మంచాలు ఎత్తి, చిమ్మడానికి చీపురు చేత బట్టింది ఒక చెల్లెలు. మరొకతె మా అవిడ గుడ్డలుతుకుతుంటే పిండి ఆరెయ్యసాగింది. మా అమ్మ లేచి లేవలేనట్లు స్నానంచేసి మంచినీళ్లు తేవడానికి బావికివెళ్ళింది. ఆనాటినుండి తలా ఒకపని చేసికోసాగడం వలన పనివాళ్ళ అవసరం తీరిపోయింది.

మా ఆవిడకు నారాయణస్వామి భార్యతో పరిచయ మేర్పడింది. నారాయణస్వామి భార్య దగ్గర విస్తళ్లుకుట్టడం, జాకెట్లు, రవికలుకుట్టడం నేర్చుకున్నది. దొడ్లో కూరగాయిల చెట్లను పెంచి కాయలను మార్కెట్టుకు పంపి అమ్మించ నారంభించింది. ఈ విధంగా కొంత ఆదాయం రాబట్టి బియ్యం, ఉప్పు, పప్పులాంటి సామానులు తెప్పించి సంసారము దిద్దసాగేసరికి మా నాన్న విస్తుపోయాడు. తనకు, తన కుటుంబప్రతిష్టకు అదిలోపమని వాపోయాడు. కాని కనీస జీవితావసరాలైన తిండికి, గుడ్డకు, కాఫీకి అలమటిస్తున్న రోజులలో కోడలు ఆ మాత్రం తెంపుచేసి వేళకు తిండికి, కాఫీకిలోటులేకుండా చేస్తుంటే కాదని, వద్దని తాను చేయగల ఘనకార్యమేమి కనపించలేదు. కుటుంబభారాన్ని మాఆవిడ నాతోబాటు కొంతమోయసమకట్టడం నాకు కొంతమతిస్థిమితాన్ని కలుగజేసింది. మా ఆవిడపడుతున్న శ్రమకు, చేస్తున్న త్యాగమునకు నేనెప్పుడైనా అభినందిస్తే "అదేమిటండీ! యిందులో నా ఘనత ఏముందీ! సంసారభారమన్న తరువాత భార్యభర్తలిదరు వహిస్తేనే కుటుంబ సౌభాగ్యంసమకూరుతుంది" అంటుండేది.

కొంతకాలానికి నారాయణస్వామి భార్యకు జబ్బుచేసి ప్రమాదావస్థకుగురియయింది. చికిత్సచేయించడానికి డబ్బులేక నారాయణస్వామి యిబ్బందిపడసాగాడు. ఎక్కడెక్కడో ఎంతగానో ప్రయత్నం చేసాడు. కాని బీదవాడి అవసరాలను, కష్టాలను గుర్తించి సానుభూతితో ఆదుకునేవాళ్లు బహు అరుదు. నాకుటుంబ పరిస్థితులు తెలుసుకాబట్టి నాకెంతనో డబ్బిచ్చియున్న ఆయన నన్ను అడగడానికి మొగమాటపడ్డాడు. నేనే "స్వయంగా నారాయణ స్వామీ! ఏదో డబ్బుకు యిబ్బంది పడుతున్నట్లున్నదినీవు — ఎల్లుండి ఉదయానికి నీకు ఎంతకావలసియుంటే అంతయిస్తాను. బెంగపడవాక" అన్నాను చిన్నమహారాజులాగ.

"ఎంతో ఎందుకు బాబూ! వందరూపాయలు చాలు. దాంతో మా అవిడను చికిత్సకు మద్రాసుకు తీసికెళదామని" అన్నాడు

"అలాగేలే"-అన్నాను ఫైల్సులో కాగితాలను సర్దుతూ.

మరునాడు నాకు ఆఫీసులో రాత్రిడ్యూటీ. నేను మరొకగుమాస్తా, మేనేజరు మాత్రమే యున్నాం. ఆఫీసులో నేను టేబిలు ముందుకూర్చొని ఫైలుతిరుగవేస్తున్నానేకాని నారాయణస్వామి తన భార్యకు చికిత్సకని డబ్బులేక పడుతున్న యిబ్బంది కనులలో మెదలుతున్నది. నాకు నారాయణస్వామి చేసిన సహాయమునకు నేను అతని అవసరాన్ని తీర్చలేకపోతే ద్రోహం అనుకున్నాను. నేను మరునాటి ఉదయానికి నూరురూపాయలు తెచ్చియివ్వలేకపోతే నారాయణ స్వామికి నేను అసమర్థులలో జముయని అంతర్వాణిఘోషించసాగింది. మెల్లగాలేచి మేనేజరుగది తలుపుత్రోసుకొని లోనికి వెళ్లాను. మేజామీద ఇనుపపెట్టె తాళాల గుత్తియున్నది. మేనేజరు కుర్చీలో కూర్చునే కునికి పాట్లు పడుతున్నాడు. నేను వెళ్ళగానే కళ్లుతెరచి "ఏం! ఎందుకువచ్చావు? ఏంపని లేదా" అన్నాడు చేతియమాలుతో మూతితుడుచుకుంటూ.

"పనిలేకేంసార్!— నాకు అత్యవసరంగా నూరు రూపాయలు కావలసివచ్చింది. దాన్ని మీరుయిచ్చి నాలుగునెలలలో నా జీతంనుండిరాబట్టుకుంటే చాల మేలుచేసిన వారగుతారు" అన్నాను ప్రాదేయపూర్వకంగా.

"ఏమిటీ! — నూరురూపాయలా! నీకివ్వడానికి నేనిక్కడ కువ్వాలుపోసుకోని కూర్చునియుండలేదు. పోయి పనిచూచుకో" అన్నాడు ముఖంచిట్లిస్తూ మేనేజరు.

"అలాగంటే ఎలాగసార్! అత్యవసరపరిస్థితులు కాబట్టే మిమ్ములనింతగా ప్రాధేయపడుతున్నాను - దయయుంచండి" అన్నాను.

"నీకుకదూ చెప్పేది! పో! ముందుబయటికి" అంటూ లేచాడు. నేనక్కడనుండి కదలలేదు. నన్ను మెడబట్టి బయటికి నెట్టాలని నాపైకురికాడు. మా యిద్దరి పెనుగులాటలో మేనేజరు అక్కడున్న ఇనుపబెంచిమీదపడి దానిమూల కణతకుదిగబడి బలనగాయంతగిలి స్పృహతప్పిక్రిందవాలాడు. గాయంమైనుండి రక్తము బొళబొళ కారసాగింది. నాకు కాళ్ళు, చేతులు గజగజవణకినవి. మరునాడుదయం ఎలా

గైనా నారాయణస్వామికి వందరూపాయిలిచ్చి ఆదుకోనితీరాలని జ్ఞాపకానికి వచ్చింది. మేజామీది యినుపపెట్టె తాళాల గుత్తి నన్ను ఆహ్వానిస్తున్నట్లుగా తోచింది. దాన్ని లంకించుకొని యినుపపెట్టె తెరచాను. అందులోని కట్టలుగానున్న నోట్లు నాకు దిగ్భ్రమకలిగించినవి. నారాయణస్వామి నాదుకోడానికి కావలసిన నూరురూపాయలు తీసికొని పెట్టెతాళంవేసి తాళాలగుత్తిని యథాస్థానంలో నుంచి గదినుండి బయటపడ్డాను. నాతోబాటు డ్యూటీకి వచ్చిన గుమాస్తా యీ గొడవతోటి తనకేమి ప్రమేయము లేనట్లు కుర్చీలో కూర్చుని టేబిలుమీద తలవాల్చి నిద్రపోతున్నాడు.

మేజామీది కాగితాలన్నీ గబగబ సర్దేసి చడీ, చప్పుడులేకుండా ఆఫీసువదలిపెట్టి యిల్లు చేరాను. మరునాడు ఉదయం నా దగ్గర నూరురూపాయలు తీసికొని నారాయణస్వామి భార్యా సమేతంగా చికిత్సకు మద్రాసుకు బయలుదేరి వెళ్ళాడు.

నారాయణస్వామి మద్రాసులో భార్యకుచికిత్స చేయిస్తూ పదిహేనురోజులున్నా ఆమె ఆరోగ్యం క్షీణించిందే కాని మెరుగు కాలేదు. చివరకు వ్యాధి ముదిరి ఆమెచనిపోగా నారాయణస్వామి గంపెడు చీకటి నెత్తినవేసికొని వచ్చి యిల్లుచేరాడు. వచ్చి రాగానే మా యింట్లోమేము కనుపించకపోయేసరికి చుట్టుప్రక్కలవాళ్ళను విచారిస్తే నేను మేనేజరును హత్యచేయసమకట్టానని, ఆఫీసు యినుపపెట్టెలోనుండి డబ్బుదోచుకొని వెళ్లాననే, అందుకుగాను నాకు పదిసంవత్సరాలు జైలు శిక్ష విధించబడిందని, కుటుంబము అప్పులపాలు కాగా యిల్లువాకిలు అప్పులవాళ్ళ పరమయి తలదాచుకోడానికి కూడ స్థలములేక నావాళ్ళంతా చెట్టుకొకరు, గుట్టకొకరు అయిపోయినారని చెప్పారు. అదివినగానే నారాయణస్వామికి తన భార్యకు చికిత్సకుగాను నూరురూపాయలు కావలసి ఏర్పడిన పరిస్థితులు, అందుకుగానే నేను సాహసించియుంటానని మనసుకు తట్టి తనమూలంగా కేకదా నాకుటుంబము మొత్తము నామరూపాలు లేకుండా పోయిందని భోరున ఏడ్చాడు. మతిభ్రమించింది. అప్పటినుండి ఎక్కడా నిలకడగానుండకుండా తిరుగుతూ పిచ్చివాడని, వెర్రివాడని అనిపించుకుంటూ చివరకు యిక్కడికి వచ్చి బాబాసాన్నిధ్యం చేరాడు.

పదీ సంవత్సరాల శిక్ష ముగిసి బయటికిరాగా నాకు శూన్యంమిగిలింది. మా అమ్మ, నాన్న చనిపోయారు. నా భార్య ముక్తిమార్గాన్ని అన్వేషిస్తూ వైరాగ్యంతో ఎక్కడికిపోయిందో ఎవరికీతెలియదు. నాకు ఎలాటి బాదరబందీలులేవు. ఆత్మ, పరమాత్మల ప్రేరేపణతో శ్రీ బాబా ఆరాధనకు, మానవసేవకు ఉపక్రమించాను యీ గ్రామంలో. నారాయణస్వామియే నిమ్మయ్యఅని నాకు తెలుసు; కాని నన్నుమాత్రం మతిభ్రమచే నిమ్మయ్య గుర్తించగలస్థితిలో లేడు జీవితాంతమువరకు"

# హితరత్నములు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

శ్రీకరు, డల్లా, వస్తె
లోకముల ప్రకాశమైన । లోకాధీశుం
డౌ కరుణా మూర్తి ; మనల
ప్రాకటముగ బ్రోచు సతము । వర్ధిల,
హితుడా !

ధరలో గడు వినయము తో
బఱగెడి పోలాకి శ్రీని । వాసుడు మదిలో
గురిసిన హితముల జేరిచి
పురవీధుల విడిచినాడు । ముదమున,
హితుడా !

నిజమాడిన నిష్ఠురమా ?
నిజమేగద తేటబడును । నిలకడమీఁదన్
నిజమును బలికేటప్పుడు
ప్రజలకు భయపడగనగునె । వసుధను,
హితుడా !

కాల ప్రవాహ మారసి
కాలములో సలుప గలుగు । కార్యము
లెల్లన్,
జాలము సేయక గూర్చిన
మేలుగదా జనములకును । మేదిని,
హితుడా !

దేవుని నిర్మల మనమున
భావించియు భక్తితోడ । భజియించినచో
దేవుడు సంతసమునుగని
జీవులకును మోక్షమొసగు । సిద్ధము,
హితుడా !

"వందే ! మాతర"మని "జై !
హిం"దని "జే ! జే ! లు" పాడి । హిందూ
దేశం
బందు జరించే మానవ
బృందము శుభమొందుగాత । వేడుక,
హితుడా !

మానవ కల్యాణమునకు
మానితమౌ సేవసల్పి । మనవలె, మఱి
యున్
మానవుల సమత నరయుచు
పూనంగా వలెను ప్రేమ । బుడమిని,
హితుడా !

భారత దేశ స్వతంత్రత
గోరుచు త్యాగమ్మున నురి । కొయ్యలను
దలల్
జేరిచి యసువులు బాసిన
ధీరుల నిజదేశసేవ । దెలియవె ! హితుడా !

హిందూ దేశమ్మునకున్
గాంధిజి, నెహ్రూజి మున్ను । గాగల
పెద్దల్
అందించిన సత్కృషి నా
నందమ్మున దలచుచుంట । న్యాయము,
హితుడా !

ఈ వొక స్వతంత్ర పౌరుడ
వీవొనరుచు కార్యములను । నెఱిగియు,
దేశం
బే విధమున మార్పుం గను
నా విధమున దిరుగుచుండ । నగుజుమి !
హితుడా !

నవభారత సంక్షేమత
దవిలి మహామహులు తెలుపు । ధర్మమ్ముల
నీ

ప్రవిమల మానస సీమను
నివసింపం జేయువలయు । నిరతము,
హితుడా !

జీవనమందున సాంఘిక
జీవనమును సలుపుచుంట । శ్రేయము,
దానిన్

భావించి సంఘ విధులను
గావించుట కొఱకు పాలు । గనుమో
హితుడా !

నారీమణులను, శిశువుల
నారసి పాత్రత నొసంగ । నగుజుమి ;
వారల్

ధీరులు, వీరులు గారని
పూరుషులు దలంప దగదు । పుడమిని,
హితుడా !

అందఱి దేశం బొకటే,
యందఱి స్వాతంత్ర్య మొకటె । యని దల
చియు దా

మందఱి స్త్రీలకు స్థానము
లందించుట పూరుషులకు । న్యాయము
హితుడా !

వెనుకబడి నట్టి వారల
గనుగొని సర్వాభివృద్ధి । గలిగించుటకై
వెనుకంజ వేయబోకను
మును మున్నే సేవ సలుప । ముదమూ,
హితుడా !

మనల ప్రభుత్వమ్మును, మఱి
మనము ప్రభుత్వమ్ము వారి । మఱువక
యండన్

అనయం బన్యోన్యముగా
గనవలెను సహాయమెంతొ । ఘనమా,
హితుడా !

కూడున్, గుడ్డయు, నీడయు
గూడంగావలెను ; వాని । కొఱకై యత్న
మ్మొనరక సేవలు సలిపిన
నాడు గదా నీదిదొడ్డ \ నాడగు హితుడా!

అసమత్వము బాయుటకై
పసగల దేశమ్ముజేయ । బాల్పడి మఱి
యున్

అసమాన జీవనమునకు
నసమాన ప్రమాణ మధిక । మరయుము,
హితుడా !

కల సహజ సంపదలతో
గల మానవ బలముగూర్చి ; కడు నుత్ప
త్తిన్

గలిగించునపుడె దేశము
తుల దూగును సంపదలను । దొడ్డగ
హితుడా !

తన గృహమును, గ్రామమ్మును,
తన దేశ శుభమ్ముకొఱకు । దలకొని సంజీ
వనమును సలుపగ దలచిన
దన సౌభాగ్యమ్ము మిగుల । దనరును
హితుడా !

చేతి పరిశ్రమలే వి
ఖ్యాతికి నిరవగుచు దేశ । కాటక మడ
చున్,

శీత నగాది కుమారిని
జేతి పరిశ్రమలు జేయ । జెల్లును, హితుడా!
తన కాయ కష్టమునగల
ఘనతను గనిపెట్టి సుఖము । గాంచక
యున్నన్

అనయము దరిద్ర దశలో
జననగుగా మానవునకు । జగతిని, హితుడా!
ధనవంతుడు, ధన హీనుం

దను భేదము విడిచిపెట్టి । యందఱు నొకటై
ఘనమగు శ్రమ దానమ్మున
పనులను జేయంగబూన । వలయును,
హితుడా!

తక్కువ మానవ బలమున
నెక్కువగా యంత్రబలము । నేర్పరచియు
దా
జక్కని పరిశ్రమంబులు
మిక్కుటముగ జేయనగును । మేదిని,
హితుడా!

తమ దేశపు సంస్కృతులను
తమ దేశపు సర్వ కళల । దలచియు, సరిగా
దమ విజ్ఞానము బఱపిన
దమ ఖ్యాతికి వన్నెగలుగు । తథ్యము,
హితుడా!

(సశేషము)

—(ం)—

## పాశ్చాత్యులలో కంటే భారతీయులలో బ్లడ్ ప్రెషర్ తక్కువ

ఇండియాలో ఎటువంటివారిలో బ్లడ్ ప్రెషర్ ఉన్నదో గురించి ఇద్దరు న్యూఢిల్లీ డాక్టర్లు జరిపిన సర్వే ఈ నెల "సర్క్యులేషన్" సంచికలో ప్రచురించబడింది. అమెరికన్ హార్ట్ అసోసియేషన్ వారి పత్రిక ఇది.

న్యూఢిల్లీ డాక్టర్లు అయిన ఎస్. పద్మావతి, సావిత్రి గుప్త కలిసి ధనికులను, పేదలను పరీక్షలు చేసి తేల్చిన వివరాలు ఈ వ్యాసంలో పేర్కొనబడ్డాయి.

విచిత్ర మేమిటంటే, ధనికులలో అన్ని వయస్సులలో ఉన్నవారికికూడా బీదవారికంటే హెచ్చుగా బ్లడ్ ప్రెషర్ ఉన్నదనీ, ఇండియాలో అన్ని ఆర్థిక తరగతుల వారిలోనూ, అమెరికనులలో కంటే తక్కువ బ్లడ్ ప్రెషర్ ఉన్నట్లు కనిపిస్తున్నదనీ వీరు కనిపెట్టారు.

ఇండియనులలో ఏ తరగతుల వారిలో ఎంతెంతగా బ్లడ్ ప్రెషర్ ఉన్నదో నిజమైన సమాచారాలు ఇదివరకు అట్టే లేవనీ, పాశ్చాత్యులలో కంటె భారతీయులలో బ్లడ్ ప్రెషర్ తక్కువని సామాన్యంగా భావిస్తుంటారనీ, తమ పరిశోధనల వల్ల ఇది నిజమని తేలిందని ఈ డాక్టర్లు వివరించారు

♦ ♦ ♦

## గంటకు పదిలక్షల పేజీలు చదవగల యంత్రం

శాస్త్రవిజ్ఞాన, సాంకేతిక సారస్వతాన్ని త్వరగా పరిశీలించడానికి సోవియట్ శాస్త్రజ్ఞులు రూపొందించిన సమాచార యంత్రాలు గంటకు పదిలక్షల పేజీలు చదవగలవు.

ఈ యంత్రం, పాఠకుడు కోరినరీతిగా గ్రంథాన్ని చదివి, సమీక్షించగలదు. గ్రంథాన్ని సంక్షిప్తం చేయగలదుకూడాను. గ్రంథం విదేశభాషలోవుంటే, వేరొకయంత్రందానిని అనువాదం చేస్తుంది. మనకు కావలసినది కొన్ని సాంకేతాలలో యీ యంత్రంలోకి, టెలిఫోన్ డయల్ తిప్పినట్లు, ప్రవేశపెడితే ఆ వ్యాసంగాని, పుస్తకంలోని భాగంగాని యంత్రం చదువుతుంది.

ఈ యంత్రాన్ని ఒక గ్రంథాలయంకూడా వుపయోగించవచ్చును. తీగెలద్వారా ప్రత్యేక టి. వి. సెట్లలో పాఠకులు తమకుకావలసిన పాఠ్యభాగం తెరపైచదవగలరు.

—(ం)—

# కన్నీటి తొలకరి

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A.

(గతసంచిక తరువాయి)

ఈ మహావీరుడు చిరస్మరణీయుడు. మనం పూజించినా — పూజించకపోయినా ఆ ప్రతాపసింహుని పేరును అన్నియుగాలలోను ప్రజలు స్మరించి — పూజించే తాహత్తు ఆత్యాగంతో వుంది. ఎలాగ ఆ వీరుని ఋణం మనం తీర్చుకుంటే బావుంటుందో ఆలోచించండి.

ఎదురుచూచే ఆ ప్రజల్ని - విజయోత్సాహంతో విసుగు లేకుండా జేజేలు చెప్పుతూ వీరప్రతాపసింహుని దర్శనభాగ్యంకోసం తహ తహ లాడే ప్రజల్ని — యీ విషాదగాధని విని నిలువునా నీరయిపోయే ఆ ప్రజల్ని — ఆవేశం తగ్గించుకోమని ప్రాధేయపడదాం! కర్తవ్యం యేమిటో తెల్పమని కోరదాం. నడవండి — వీరులారా నడవండి — ప్రతాపసింహుని కీర్తనీయ చరిత్రను పదాలతో పాడుతూ నడవండి — ఆమహనీయుని ఆత్మశాంతికి ఆ సర్వేశ్వరుని నుతిస్తూ - స్తుతిస్తూ ముందుకునడవండి — విచారసూచకంగా జెండాలు సగంవంచి సాగండి... యిలాగ వీరావేశంగా మాట్లాడింది ఎవరో ఎరుగుదురా? అడుగో అమరసేనుడు, ప్రతాపసింహుని కుడిభుజం.

విన్నారు - అక్కడి వారంతా నెత్తురును వేడిక్కించి నరాలని కుతకుతవుడికించే ఆ మహోపన్యాసాన్ని. ఒక్కొక్కమాట - అమరసేనుడు నోటినుంచి వినిపించేసరికి ప్రజలు వొళ్లు తెలియకుండా వున్నారు. త్యాగమూర్తి ఆ వీరప్రతాపుని ఆకస్మిక మరణానికి తల్లడిల్లిపోయారు. ఆ వీరుని చేతులారా చంపిన పిశాచి వీరబాహుణ్ణి అమాంతంగా హత మార్చాలని వురుముతున్నారు. ప్రజలకోసం ప్రాణాలర్పించిన — ఆ ప్రతాపసింహుని మృతకళేబరం యింకా చిరునవ్వులు నవ్వుతూన్నట్టే - వారికేదో అమరసందేశం యిస్తూన్నట్టుగానే భావించినారేమో మరి - విప్లవానికి - ఉద్రేకానికి — అనంతావేశానికీ హద్దుల్లోనేవున్నారు. ఎంత హద్దుల్లోవుంచుదామన్నా — ఆ ప్రజాసమూహంలోంచే — చింతనిప్పుల వంటి కళ్లతో — తళతళ మెరిసేకత్తితో — చల్లారని పగతో - ఆపినా ఆగని తొందర పాటుతో - తరతరా ఒకయువకుడు పళ్లు పటపట కొరుకుతూ వుద్రేకంగా బయలుదేరివస్తున్నాడు. ఆపేవారిని అటకాయించి—అడ్డువచ్చేవారికి కత్తి చూపుతున్నాడాతడు ఎవరీతడు? ఏమిటీ ఉద్రేకం? ఎవరిని ఏంచేస్తాడో? ఆపినా ఆగడే! సరాసరి వీరబాహుని దగ్గరకు పోయాడు. ఏరాః పిరికిపందా? హూః అని గర్జించాడు. అన్నింటికీ తెగించిన వీరబాహుడు - బ్రతుకు మీద నిరాశ చేసుకొనేవున్నాడు. ఆ యువకుడు వీరబాహుని జుట్టుపట్టుకొని అటూ యిటూ వూపివేశాడు. ఇలాంటి జగడాలు అతడిజీవితంలో ఎన్నో? వందలా — వేలా? అన్నట్టుంటాయి. చింత చచ్చినా పులుపుచావదన్నట్లు ఆ రౌడీరాజా — ఆయువకుణ్ణి ముప్పతిప్పలూ పెట్టినంతపనిచేశాడు. వాళ్లిద్దరికీ జరుగుతూన్న సంఘర్షణను చివరదాకా చిత్రంగాచూస్తున్నారు అక్కడివారు. ఇంకెక్కడి నక్కజిత్తులురా అని ఆ యువకుడు తోకతొక్కిన తాచులాగ— కత్తిదూసి — కోపంతో ఆఘోరకాయుని గుండెల్లో గుచ్చాడు. కత్తి పోటు తగిలించే తడవుగా ఆ ఆ దొంగలధోర కుంగిపోయాడు. అః అబ్బా! అంటూ నేలకూలి - గుండెల్లో దూరిన కత్తిని పట్టుకొని బాధను కప్పిపుచ్చుకొని నవ్వునటిస్తూ ఆమృత్యుఘడియలలో — ఆ ఎగవూపిరితోనే - హాయ్! హాయ్! అన్నాడు.

పరివారమంతా భస్మంకాగా - దోపిడీధనం దొరలపాలు కాగా—కొనవూపిరితో బాధపడుతూ - మరోక్షణంలోనే మృత్యుదేవత కబళకు కోరలకు కానుకగానున్న ఆ అభాగ్యుడలా నవ్వుతాడేమిటి! అని కొందరు విస్తుపోయారు. ఎవరికేం తెలుసు ఆ అవసానదశలో అతని ఆగిపోయేగుండె యే ఆనంధాన్ని అతనికి జ్ఞాపకంచేసి అలా నవ్వించిందో? లేకపోతే కత్తిపోటుతో గుండెల్లోంచి రక్తం వరదలు కట్టి ప్రవహిస్తూంటే — ఆ విషాదమరణానికి విచారించే వాళ్లేరని తెలిసికొని — శత్రువుల మధ్య దారుణమరణానికి ఆహుతి అయిన అంతటి ఘోర

నాయకుడు – ఈ ప్రపంచభోగాలు యింతేనని నవ్వు కున్నాడా? హింసను ఆదరిస్తే హింసామరణమే వచ్చిందని గ్రహించి–సరిపెట్టుకుని నవ్వుకున్నాడా? ఎందరు ఎన్ని జీవననాటకాలలో ఎన్ని పాత్రలు ఎలా నిర్వహించినా – చివరికి అంతా యింతేనన్న వేదాంతం తెచ్చుకొని తెలుసుకొని – బ్రతుకు రహస్యానికి ఫక్కుననవ్వుకున్నాడా? ... ఎందుకు నవ్వాడు యీ విపరీత విపత్కర సమయంలో? యిలాగే అంతా ఒకరిముఖాలవైపు మరొకరు చూసుకుని – చూపులతోనే ఆశ్చర్యాన్ని ప్రకటించు కుంటున్నారు.

వచ్చేప్రాణం పోయే ప్రాణం – ఎగవూపిరి – ఇంతటి మరణచిహ్నాలు అతణ్ణికూల్చి – క్రుంగదీస్తున్నా – అతడు గిలగిల తన్నుకుంటున్నా – యింకా నవ్వుతూనేవున్నాడు కొంచం కొంచంగా. ఆ కొంచం నవ్వులో గొణుగుడు మాటలు ఏవో!

ఎంతగట్టి పిండంరా వీడు! అంతటి కత్తిపోటుకీ తట్టుకొని యింకా చావనేలేదే – మరోమనిషైతే ఆ నెత్తురు చూసే గుండె ఆగి చచ్చేవాడు. బెదురు లేనితత్వం. భయంలేనిరక్తం. పోషకివున్న దేహం. ఆకండలు – ఇనపతీగెల్లాంటి నరాలు – ఉక్కుతుండులాంటి మనిషి. చీకూ చింతా లేకుండా బ్రతికిన వాళ్లు – అంతచప్పున చావలేదు. ఈ కలికాలంలో కిలకిలానవ్వుతూండే వాళ్లు రోగాలకు దూరంగా వుంటారు. వాడూ – వాడి బ్రతికిన తీరూ యేచక్రవర్తికివుంది? అని కొందరు అనుకుంటూండగానే మరికొందరు వాడిమాటలేవిటో విందాం అని నిశ్శబ్దంగా వుండి ఆ చచ్చిపోతూన్న వీరబాహుని గొణుగుడు మాటల్ని చెవువొగ్గి వింటున్నారు.

వీరబాహుని ముఖాన చావుకళే లేదు! ఏదో ఘన కార్యం సాధించినట్టుగా వికసించివుంది– ఆ నవ్వుముఖం ఆ నవ్వుల మధ్య బాధ – బాధల మధ్యనవ్వు – ఈ పరిస్థితిలోనే కొనవూపిరి – ఆ వూపిరిని బిగబట్టి – ఉత్సాహంతో, ఉద్రేకంతో, అతడు యిలా యింకా గొణుక్కుంటున్నాడు.

నా జీవితాశయాన్ని సాధించాను. మా జాతిని చిత్రవధ జేసి, మాఖజానాను నిలువునాదోచుకొని– మా జీవాలను ఉసురుపెట్టిన ఆ దొంగలకన్నా దొంగ–మాయప్రతాపుని ప్రాణాలు తీసిన పేరునాకే దక్కింది. ఆ వార్తవిని స్వర్గీయులైన నా అనుచరులు ఎంతో సంతోషిస్తారు – హాయిగా తియ్యని పగ తీర్చుకొని చస్తున్నా! మరే బెంగాలేక – అంటూ గొణుక్కొని చివరకు విగతజీవుడయ్యాడు ఆ వీరబాహుడు, కలికాల కర్ణుడు చచ్చాడన్నారు అందరూ. చచ్చినవాడిని చేడేసికళ్ళతో చూచారు. శవాన్ని కదిపారు. బ్రతికివుండగా వాడిదగ్గఱకేపోలేనివాళ్లు ధైర్యంగా శవాన్ని చూడలేకపోయారు పాతబెదురుతో. నిజంగా చచ్చాడో – లేక చావు నటిస్తున్నాడో తిన్నగా చూడండని కొంతమంది పిరికి పెద్దలు హెచ్చరిస్తూంటే – యింకేముంది. ఇది జీవంలేనికంకాళం – చిలక ఎగిరిన పంజరం. అంటూ అందరూ ఆశవంమీదనుంచే పోయారు – పగతో – బాధతో చెరిసగం సంతృప్తితో – వీరప్రతాపుడులేడే – మరిరాడే – మనకోసం ప్రాణదానంచేశాడే – అనేవిశ్వాసంతో.

ఏ రాహుకాలంలో ఆరంభించబడిందో యీ వూరేగింపు! రెండు నిండు ప్రాణాల్ని బలితీసుకొని రుచిమూచింది.

మెల్లిగా పాకింది పాడువార్త. అపజయ వార్తలు – ఆకస్మిక ప్రమాదాల వార్తలు – మరణ వార్తలు; ఇటువంటి తరహాకుచెందిన పట్టి అశుభ వార్తలు వాయువేగ – మనోవేగాలతో ప్రయాణం చేస్తాయి.

ఎదురు చూస్తున్న వారందరూ – యీ విషాద వార్తవిని తెల్లబోయారు. ఇది నిజమా? అని కొందరు నమ్మలేకపోతున్నారు. మరికొంతమంది గుండెబల హీనతగలవాళ్ళు ఈ వింతవిచారవార్తను విన్నదే తడవుగా మూర్ఛవచ్చినట్లు పడిపోయారు. అందరి ముఖాలలోనూ ఆశ్చర్యమూ – విచారమూ తాండవిస్తున్నాయి. దేవుడా! ఆ మంగళమూర్తికే చావు పెట్టాలా – మా ఆనందాన్ని చూడలేవా – మా కళ్లు అంత పాపిష్టివా? అంటూ ఆవేదనా – రోదనా ఆవరించాయి ఆ ప్రజసమూహాన్ని!!

క్షణం మనది కాదని కొందరు–బ్రతుకు బుద్బుద ప్రాయమండీ అని మరికొందరు. అవతార పురుషులు ఘనకార్యాలు చేసి చప్పున దివంగతులవుతారండీ. యిదికొత్తకానకనా పుణ్యపురుషులకి అని యింకా కొందరు వ్యాఖ్యానించారు.

అయ్యో! ఆ సుశీలాదేవికి ఎంతకష్టం వచ్చింది! పసుపు కుంకుమ కలవైపోయారే! చిన్నారిచిట్టిబాబు తండ్రిలేనివా

దయ్యాడే! అని ఆ వూరివారంతా చింతాక్రాంత చిత్తులై సుశీలా దేవిని ఓదార్చడానికని గుంపులు గుంపులుగా పోతున్నారు.

పూలదండలు వాడిపోయాయి, మంగళహారతుల పళ్లాలు చేతుల్లోంచి జారిపోయాయి. అందరి కళ్లూ విచారంతో నీటిమయమయ్యాయి. ఒక్క ప్రాణి కోసం అలా అందరూ దుఃఖిస్తున్నారు. ఇది అందరికీ విపత్తుగానే పరిగణింపబడింది. అంచేత ఎవర్ని ఎవరూ ఓదార్చుకోవడంలేదు.

కాలం చేసే గారడీ యింతా - అంతానా! క్షణం మనదికాదుకదా. కొన్ని ఘడియలక్రితం సుశీల సుమంగళి. పసుపు కుంకుమలకు లోపం లేని యిల్లాలు. నల్లపూసలదండ తెగిపోని నారీమణి. వీరప్రతాపుని వీరపత్ని, పురజనుల జోహార్లతో మురిసిపోయిన మగువ. అందరి దృష్టిలోనూ ఆమె ఎంతో అదృష్టవంతురాలు.

ఇప్పుడో! కాలచక్రం తిరిగింది. ఆవిడ అదృష్ట చక్రం వక్రంగా తిరిగింది. పతివియోగవిచారం ఎదురయింది. తనమాంగల్యశోభ మటుమాయమై పోయింది. నల్లపూసలదండ తెగిపోయింది. అందరి దృష్టిలోనూ ఆవిడ యిప్పుడు ఎంతో దురదృష్టవంతురాయి.

ఏపాపం యెరగని – ఏమాయా మర్మం యెరగని ఆ పసిపాప బాలచంద్రుడు తండ్రిగండాన పుట్టాడేమో – లేకపోతే యింతటి దుర్మరణమా! అని కొందరు అనుకున్నారు.

మహాపర్వదినాన – మంచితిథి నారనక్షత్రాలతో మనుగడ చాలించిన ఆ మహనీయుడు చరితార్థుడన్నారు – పంచాంగాలు తిరగవేస్తూన్న పురోహితులు.

వీరావేశంతో – ప్రతాపసింహుని కీర్తిస్తూ – అతని సాహసచరిత్రను పదం పాడుతూ వీరకదం తొక్కుతూ – వూరేగింపు వూళ్ళోకి వచ్చింది. దేవుడువూరేగింపులో వస్తే ఎంత భక్తిశ్రద్ధలు చూపుతారో - ప్రజలు అలాంటి భక్తిశ్రద్ధల్ని ఆ యోధునిపట్ల చూపించారు. బాష్పకణాలునిండిన కళ్ళతో – పూలవానలుకురిపించారు. జే జే లు చెప్పారు. చేయెత్తినమస్కరించారు. వినయంగా కళ్లుమూసుకొని అంజలించి ఆత్మశాంతికై – భగవంతుని ప్రార్థించారు. ఆ వూరేగింపు సాగడం ఎంతో కష్టంగావుంది.

మారుమూలలలో మూలుగుతున్న ముసలివాళ్ళు కూడా—వొణుకుతూ కర్రపుచ్చుకొని, ఏడి నాయనా- ఆ పుణ్యాత్ముడు! అంటూ ఆ జనాన్ని తోసుకొని- అగుపించీ అగుపించని చూపులో ఆ మంగళ విగ్రహాన్ని చూసి – ఎంత దర్జాపురుషుడవురా బాబూ! అప్పుడే నూరేళ్ళూ నిండాయా నీకు! మాలాంటి వాళ్ళు యీ మట్టిమీదా! నీలాంటివాళ్ళు అప్పుడే స్వర్గంలోనేనా! పాడు రోజులు! పాడు రోజులు!! అని ఆ వయస్సుమీరినవాళ్ళు వాపోయారు.

చూడండి . ఆ చిరునవ్వుల ఠీవి! ఇంకా ప్రాణం వున్నట్టుందే కాని – చచ్చిపోయినట్టున్నాడు టండీ మహానుభావుడు! ఆహాఁ చంటిపిల్లలుకూడా దడుసుకోవటంలేదండీ! ఎంతటి మంగళ విగ్రహం! సాటి మానవ సమాజ సౌఖ్యంకోసం – సాహసించి, యిలా త్యాగంచేసిన ఆ అమృత స్వరూపానికి మృత్యువే లేదన్నారు – చూస్తున్నవారు, కన్నీటిధారలతో – కైమోడ్పులతో ఆ ప్రజలంతా ఆ మృతకళేబరాన్ని దేవతా విగ్రహంలాగ అర్చిస్తున్నారు. వీరబాహుడే నీ పాలిటి యమకింకరుడా! శాంతి దూతవు అప్పుడే కన్ను మూశావా! కన్న తండ్రీ అంటూ బిక్కమొహాలువేసి భేరుమని దుఃఖం ఆపుకోలేనివారు చిన్నపిల్లల్లాగ కటకటపడ్డారు. ఈ కీర్తిమూర్తి ఋణం యెన్ని జన్మలకైనా మనం తీర్చుకోగలమా! అని గాఢవిచారాన్ని వెలిబుచ్చారు. మన కష్టాలు తనవే అనుకొని యింత త్యాగంచేసి యిలా సుఖశాంతుల్ని సమృద్ధిగా చూపించి మన సుఖాలలో తనకు సుఖాపేక్ష లేనట్టు కన్నుమూశాడే యీ గణ్యాత్ముడనుకొన్నారు.

ఇలాంటి విచార సూచక భాషణలతోనే ఆ వూరేగింపు ప్రతాపసింహుని ఇంటిముందు ఆగింది. తీర్థప్రజలాగ వున్నాయ జనం. దీనంగా చూసేవారూ- తెల్లబోయి చూసేవారూ – అయ్యో! అని అటమటించేవారు – యెంతో పండుగ అనుకున్నాం – మా పండుగ యిలా బ్రద్దలయిందే బ్రహ్మదేవుడా! అనుకుంటూ కుమిలిపోయేవారూ! యీ దృశ్యాన్ని చూడలేక సొక్కిపోతేవారూ! సుశీలను పట్టుకొనేవారు! బాలచంద్రుణ్ణి ఎత్తుకొనేవారు! ఏమీ తోచక గిజగిజలాడేవారూ ... యిలాగ వున్నారందరూ – అక్కడ.

ఏనుగుమీదవున్న ఆ ప్రతాపసింహుని దేహాన్ని – బంగారు జలతారు శాలువాతో కప్పబడివున్న ఆ

దేహాన్ని విచార ముద్రలతో దింపారు. పట్టుపరుపు పరిచిన ఆ ఎత్తరుగుమీద వుంచారు. కంఠంలోంచి దూరిన బాణం — గాయం — వీరబాహుని దారుణ కృత్యం! అంతా చూశారు. అమరసేనుడు — చిన్న వాడిలాగ ఆ శవంమీదపడి ఏడ్చినాడు.

ఇంత దారుణహత్య చేసినవాడు మాత్రం పుట్టి కట్టుకోని పుయ్యాల వూగడా! వాడూ బలవంతంగా చావలేదూ! హింసకి — హింస యివ్వడుటండీ ఆ దేవుడు! అనుకుంటున్నారు మరికొందరు.

అంతా యింత బాధపడుతున్నారు. సుశీలాదేవి- గతించిన భర్తవైపు అలాగే చూస్తూ నిలబడివుంది. ముద్దుబిడ్డ పక్కనేవున్నాడు. చంటిపిల్లవాడికి మాయా తెలియదు, మర్మం తెలియదు. కష్టం తెలియదు. సుఖం తెలియదు. అతని దృష్టిలో అమృతం- విషమూ అనే భేదంలేదు, ఏడిపించినా—పగలేకుండా ఏడుస్తాడు. ఏడిపించనివాళ్ళతో నవ్వుతాడు. అలాంటి సమతాభిమానికి యీ లోకంలోవుండే బ్రతుకు మర్మాలు - జనన మరణాలు—ఆపదలు సంపదలు యేమీ తెలియవు. తన తండ్రి అలాగ విషాద మరణానికి బలిఅయిపోయాడని ఆ పసిబిడ్డకేం తెలుసు? పడుకున్నాడు నాన్న — లేచివస్తాడు — లేచి నన్ను ముద్దాడుతాడు అనుకుంటున్నాడేమో—మూగభాషకి టిప్పణి ఎవరు చెప్పగలరు! అంతటి అలజడిలోనూ ఏ బాధా ప్రకటించనివాడు ఆ బాలచంద్రుడొక్కడే!

ఆ సుశీలాదేవి యింతసేపూ అలాగా నిలబడి వుంది. తదేక దృష్టితో — భర్తవైపు చూస్తూంది. చైతన్యంలేకుండా చూస్తోంది. ఏమనుకొందో? ఎంతబాధపడిందో? శిలాప్రతిమలాగ నిలబడింది. కదలకుండా — మెదలకుండా అలాగే నిలబడింది. నల్లపాప కంటిలో నడకనే మానేసింది. విచారం - రక్తాన్ని కవ్వంతో చిలికినట్లు కలిపేసి జీవశక్తిని కబళించేస్తూంది.

చూశారు. అంతా ఆ సుశీలాదేవి వైఖరిని చూశారు. విచిత్రంగావుంది అందరికీ. మాటాలేక మంతీలేక సుశీల అలాగేవుంది. ఇంక అందరిలోనూ ఆతురత పెరిగింది. భర్త చనిపోతే బావురుమని ఏడవదే! కంటినుండి ఒక్క నీటిబిందువుకూడా రాదే! ఆవిడకు విచారంలేదా? మరి రాదా? లేకపోతే- ఆ విడ అలా నిలబడివుండగానే ప్రాణాలు పోయాయా? ఏం? పోతేపోవచ్చు. అదీ సంభవమే. విపరీత విచారం హృదయగతిని ఎందుకు నిరోధించలేదు? అయితే — అంతపని జరిగిందా? జరిగితే - ఆ ముద్దుబిడ్డకు తండ్రిలేనిలోటుకు సాయం — తల్లిలేనిలోటుకూడానా? ఎంతలో ఎంతమార్పు!! క్షణం మనదికాదుకదా!

పిలవండి వైద్యుల్ని — అలా చూస్తారేం—తీసుకు రండి వైద్యుల్ని అన్నారు అక్కడివారు. ఔను - అది మంచిపని అన్నారు మరికొందరు. ఇలా అనుకుంటూండగానే వైద్యుడు చక్కావచ్చాడు. నాడి పరీక్షించాడు. ఆలోచించి-భూమ్యాకాశాలుచూసి- ప్రాణంవుంది-ఫరవాలేదన్నాడు - ఆ వైద్యుడు.

ప్రతాపసింహుని మరణానికే యింకా తమాయించుకోలేని ఆ ప్రజలకి సుశీలాదేవి బ్రతికివుంది - ఫరవాలేదు - అని వైద్యుడు చెప్పిన మాటలు కొంత తహతహని తగ్గించినయి.

అంతలోనే మళ్ళీ వైద్యుడందుకున్నాడు, ఇక రెండు గంటలలోనైనా యీమె - ఏడవకపోతే గుండె ఆగిపోవడానికి అవకాశంవుంది. చింతాక్రాంతమైన యీ శరీరంలో చైతన్యం అంకురించాలంటే - ఎడారిగావున్న ఆ నయనాలలో కన్నీటి తొలకరి చిలకరించాలి అప్పుడే మన తల్లి మనకి దక్కుతుంది అన్నాడు వైద్యుడు.

ఔను! అతని మాటలూ నిజమే మరి! చితి నిర్జీవ పదార్థాలను దహనంచేస్తే - చింతసజీవుల్నే సమాధిపాలు చేస్తుంది.

అనవసర సమయాలలో భారంగావుండే కాలం - అవసర సమయంలో చరచరాపోతున్నట్లుంటుంది. ఏంచేతనో మరి? వైద్యుడు చెప్పిన రెండు గంటల గడువులో - అప్పుడే అరగంట దాటిపోయింది. సుశీలాదేవి స్థితిలో మార్పు రవ్వంతా రాలేదు. ఎలాగ మార్పు తీసుకురావడం? ఎలాగ కన్నీటిని రప్పించడం? ఎలాగ చైతన్యం చిందించడం? ఇదే అందరినీ కలవరపెడుతూన్న గడ్డు సమస్య.

పతి గతించాడనివిని - అంతులేని చింతతో అలా శిలాస్వరూపిణి అయింది. పతిని స్తుతిస్తూ మెప్పులు ఆ విడ చెవిలోపడితే - ఆమెకు తప్పకుండా చైతన్యం వస్తుంది. కన్నీరు చినుకుతుంది. పొడికళ్ళు నీళ్ళతో నిండుతాయి. సుశీల బ్రతుకుతుంది. ఇది మంచి సాధనం అన్నారు.

ఎంత నుతించినా - ఎంత స్తుతించినా - సుశీలా

దేవి అలాగేవుంది. ఇంకేం చెయ్యాలి. మరేంచేస్తే యీమెలో చైతన్యం అంకురిస్తుంది? పోనీ ఎంతటి వీరపత్నివమ్మా! సుశీలా - ప్రతాపసింహునికి తగిన ఇల్లాలవమ్మా. మీ పవిత్రదంపతులు మా భాగ్యం కొద్దీ - మా పూజాఫలంకొద్దీ - మా గడ్డలో పుట్టారు. దుఃఖంలోంచి సుఖాన్ని ప్రసాదించారు. బ్రతుకు బాటలోవుండే ముళ్ళకంచలన్నింటినీ తీసిపారేశారు. సుశీలా! నీ భర్తకీ కీర్తిరావడానికి మూలకారణం నీవే. చక్కని చుక్కానిగల సంసారనావ యిహ పరసుఖసాధకయానాన్ని సాగిస్తుంది విజయవంతంగా, వీరమాత సుశీల. వీరపత్ని సుశీల, సుశీలకు జై అన్నారు అందరూ అనంతావేశంతో. కాని సుశీల తీరు మాత్రం అలాగేవుంది మార్పులేకుండా? చర చరా మరొక అరగంట దాటిపోయింది.

ఇంక ఏంచెయ్యాలి? ఈ నిండు ప్రాణం యిలా నిలువునా పోవలసినదేనా? అయ్యో! ప్రజా బాంధవుల బ్రతుకులు యిలా దుఃఖాంతాలేనా? త్యాగస్వరూపుల జీవితాలు యింతకష్టభూయిష్టంగా వుండేవేనా?

ఏమవాలి ఆ పసిబాలుడు? తల్లీ - తండ్రీలేని అనాథుడు కావలసిందేనా! ఏ దారీ యీ చీకటి యెడారిలో కనిపించటంలేదే - అంటూ ఖిన్నులై వున్నారు అక్కడి పౌరులందరూ. కాలం కళ్ళెం లేని గుఱ్ఱంలాగ చరచరా పోతూంది.

హఠాత్తుగా ఒక అవ్వ బాలచంద్రుడిని ఎత్తుకొని సుశీల కెదురుగా నిలబడి - సుశీలా దేవీ - యిదుగో నమ్మా - నీ ముద్దుబిడ్డడు బాలచంద్రుడు ఇదుగో నమ్మా! యిలా చూడు! యీ బిడ్డనిచూడు! అంటూ ఆవేశంతో కన్నతల్లికి - కన్నబిడ్డని చూపెట్టింది.

ఎవరిని చూస్తోందో - ఏం ఆలోచిస్తోందో - ఎక్కడవుందో ఆ మనస్సు - సుశీల ఆ ముద్దుబిడ్డవైపు చూడనేలేదు. చైతన్యంలేకుండానేవుంది అలాగే.

ఆ అవ్వ వూరుకుందా, ఏడుపే ఎరగని ఆ బాల చంద్రుణ్ణి బలవంతంగా యేడిపించింది. ఆ పసి బాలుడు గుక్కపట్టి యేడుస్తున్నాడు. ఆ తల్లి ప్రక్కనే ఏడుస్తున్నాడు. కన్నకొడుకు ఏడుపు - కన్నతల్లి చెవుల్లో కంగుకంగుమంటూ ప్రవేశించింది. ఆ ధ్వనిలో ఎంత మాంత్రిక శక్తైనా వుంటుంది. ఒక మంచి ధ్వని కొన్ని రోగాలను కుదురుస్తుంది. ఇంకొరకపు ధ్వని ప్రాణాల్ని తీస్తుంది. ఇలాంటి ధ్వని భేదాలతో ఎన్నో అనుభూతుల్ని ఆర్జించవచ్చు. కన్నతల్లికి తన కన్నబిడ్డ గొంతుక అనమాలే. ఎంతో దూరంనుంచి ఏడుస్తూవున్నా - ఆ బిడ్డ గొంతు కను తల్లి యిట్టే పసికట్టుతుంది. ఎంతపనిలోవున్నా - ఎంతతీరికలేకపోయినా - తల్లి తన బిడ్డఏడుపు సహించ లేదు. అలాగే - బాలచంద్రుడు ఏడుస్తూండగా - కదలికలేని సుశీలాదేవి అప్రయత్నంగా పెదవుల్ని చప్పరించింది. ఇంకొకరు - ఆవిడను అండగా పట్టు కున్నారు. బాలచంద్రుడు కేరుకేరుమని యింకా యేడుస్తున్నాడు. సుశీల కళ్ళు కదిలాయి. అదంతా ఆవిడకి అయోమయంగావుంది.

ఆ అవ్వ - పసిపాపనియేడిపించిన కొద్దీ - సుశీలా దేవిలో చైతన్యం వర్ధమానంగావుంది. తన బిడ్డ ఏడుపును సుశీలాదేవి యింకా గుర్తించిందేమో అప్రయత్నంగా ఆ మాతృహస్తం బుచ్చిబాబు బుల్లిగడ్డాన్ని మెల్లగా నిమురుతూంది. అవ్వ - సుశీలాదేవికి ఆ ముద్దుబిడ్డను మళ్ళీ చూపించింది. అమ్మా - యిదుగో! నీముద్దుబిడ్డ యిదుగో! గుక్కపట్టి యేడుస్తూన్న నీ ముద్దులబిడ్డ యిదుగో! ఎందరున్నా తల్లివంటివా రవుతారా? అందరిలోనూ - తల్లిగుర్తు బిడ్డకీ - బిడ్డ గుర్తు తల్లికీ వుంటుందమ్మా. ఒక్కసారి ఎత్తుకో వమ్మా! గుక్కపట్టేడిచే యీ కొడుకును ఎత్తుకో వమ్మా! అంటూ ఆ అవ్వ ఆ తల్లి ఒడిలో ఆ బిడ్డను ఉంచింది.

అనుభవం చాలా గొప్పది. వయస్సుమీరిన అవ్వ - ఎన్ని పురుళ్ళుపోసిందో! ఎన్ని కానుపులు కన్నదో - ఎన్ని పెళ్ళిళ్ళు చేసిందో - ఎంతమంది మనవల్ని మోస్తోందో! కడుపు చలవగల ఆ అవ్వకి తెలుసు - అమృతమయమైన అమ్మ మనస్సు తల్లికి ఏంకావాలి? తన సంతాన క్షేమంకన్న మరేం కావాలి? తన బిడ్డల సుఖశాంతులకోసం కన్నతల్లి ఏత్యాగమయినా చేస్తుంది. అందుకనే తల్లినిమించిన దేవత లేదన్నారు.

సుశీలాదేవి - కళ్ళారా కన్నకొడుకును! ఆ ఏడ్చేకొడుకును! ఆ తండ్రికి దూరమైపోయిన కొడుకును - తల్లిప్రేమ వినాగతిలేని ఆ కొడుకును చూచింది! బిడ్డా! అని కేకవేసి బావురుమంది. గొణుగుడు గొంతులోంచి రా! బాబూ! రా! అని వినిపించింది. పసికుడు చెయ్యిని చాచింది! అయ్యో అంది అందరి ముఖాలనూ తేరిచూడలేక!

అప్పుడే గలగలా రాలిపోయాయి - ఆ కన్నతల్లి కంటినుండి కావలసినన్ని కన్నీళ్ళు!

వీరప్రతాపుని మరణాన్ని మఱచి - సుశీలాదేవి పునర్జన్మను పొందిపోయిన ఆ పురజనుల బ్రహ్మానందం ఏంచెప్పను!

# ప్రకృతి తత్త్వము

శ్రీ వేదము వెంకట కృష్ణశర్మ



(గతసంచిక తరువాయి)

ప్రకృతి సహజముగ స్త్రీ తత్వమెప్పుడును ప్రశాంతమయినది; కాని గంభీర గుణము లేకపోలేదు. ధీరత్వము గలది; కాని తెంపరితనము లేకపోలేదు. దుఃఖశీలమయినది; కాని ధైర్యము లేకపోలేదు. సహనస్వభావముతోఁ గూడినది; కాని దుర్వారక్రోధము లేకపోలేదు. భయాకులితమయినది; కాని నిశ్చయనిరూపణశక్తి లేకపోలేదు. మోహాక్రాంతమయినది; కాని లజ్జాసంయుతము గాకపోలేదు కావుననే వారిమూలముగనే మాయ తన కార్యము నెఱవేర్చుచున్నది.

ఈ విషయమును విపులముగ నుగ్గడించునట్టి క్రింది దేవీభాగవతకథ అవశ్యపఠనీయమని నివేదించుచు, ఈ వ్యాసమింతతో ముగించుచున్నాఁడ. మాటిమాటికి, దేవతలకు, మానవులకు తక్కినవారికి, తెంపులు పెట్టుచు, ఎలుకమీద పిల్లిని, పిల్లిమీఁద కుక్కను ఎక్కించుటకు ఉసికొల్పుచు, లేనికొండెములు కల్పించి, లోకువయిన బట్టతలలకు మోకాళ్ళకు ముడిపెట్టుచు, కలహములు చెలరేపి లోకప్రళయము తెచ్చిపెట్టుచు కలహములే భోజనముగా త్రిలోకములు తిరుగు వృత్తిగల నారదుఁడు ఒకానొకప్పుడు, తన అలవాటుచొప్పున, సత్యలోకమునుండి శ్వేతద్వీపమునకు వెళ్లినాడు.

ఆ లోకములో కౌస్తుభమణిని, కాంచన, పీతాంబరమును ధరించి భక్తావనుఁడు, కరుణాస్వరూపుడు శంఖచక్రాద్యాయుధ చతుర్భుజుడు. నీలమేఘశ్యాముఁడు రమాదేవితో సరసల్లాపము లాడుచు ఆనందించుచుండెను. ఆ సమయమున – ఆయేకాంతప్రదేశమునకే నారదమహర్షి లక్ష్మీనారాయణుల దర్శించు కుతూహలముతో వెళ్లినాడు.

అప్పుడు, నాథునితో చనువుకొద్దిస్వేచ్ఛగా సంభాషించుచుండిన సముద్రరాజతనూజమయిన రమాదేవి దిగ్గన లేచి, అంతఃపురములోనికి వెడలిపోయినది. ఆమె వైఖరిని చూచి, నారదుడు విష్ణుదేవునికి అంజలి ఘటించి, జంకుతోఁ గూడిన మనస్సుతో:–"స్వామీ! చూచినారు గదా, యీ కమలాదేవి నాకుచేసిన పరాభవము? ఇదేనా, అతిథికిఁ జూపవలసిన గౌరవము? నేను తమ సన్నిధికి రావడమే తడవుగా, తాను మరుగయి పోవడము న్యాయమా? నేనేమి విటుఁడనా? దుష్టుఁడనా? వంచకుఁడనా? గౌరవింపఁ దగనివాఁడనా? జడదారిని! మాయను గెలిచినవాఁడను; మనశ్శుద్ధుఁడను ధర్మమార్గగతుఁడను. అట్టి నన్నీమె యిట్లవమానించు టేటి న్యాయము?" అని తన యావేదనను నివేదించెను.

శ్రీమన్నారాయణమూర్తి యించుక ఆలోచించి ఆ దేవమునితో నిట్లుపలికెను:-

"మహర్షిసత్తమా! భర్తతప్పు తక్కిన వాఁడెవఁడేని కనఁబడినచో, అక్కడకాం తలు నిలువఁదగదుగదా! ఇది సామాన్య లోకనీతిగదా! ఎంతటి తెలివిగలవారయిన మాయాకల్పితములగు ఇట్టి విషయముల గుర్తింపక, దానికి లోఁబడుట శోచనీయ ముగదా! సాంఖ్యయోగులు, జితవాయు సంచారులు తిరస్కృతేంద్రియ వ్యాపా రులు అగు మహాతపస్విధ్యులైన మహాముని శ్రేష్ఠులును, దేవతాగ్రణులును మాయా గతులే సుమా! ఇఁకఁ గేవలము హరిసం కీర్తినజ్ఞుఁడవు నీవు దాని నతిక్రమించుట-అనునది కలలోనివార్త అంతేల? నేనును, బ్రహ్మయు, శివుడును మహాత్ములయిన సనకసనందనాదులును ఆమాయకు అధీ నులే. అది సహజసిద్ధమును, అమేయమును అగు శక్తిగలది. దేహధారలగు దేవతిర్య ఙ్మనుష్యాదులెల్ల ఆమాయకు లొంగిన వారే.

వేదములన్నియు క్షుణ్ణముగఁ జదివిన హిరుగాని, యోగసాధనమున సిద్ధినొందిన వారుగాని, సత్వరజస్తమోగుణా క్రాంత శరీరధారులేకదా! అట్టివారికి సహితము మాయను జయింప శక్యము కాదని గ్రహింపుము. తాను రూపములేనిదయ్యు స్వరూపముల సృష్టించు నేర్పుగల కాలము గూడ మాయాత్మకమయినదే.

మానవుఁడు జ్ఞానిగా, మూర్ఖుఁడుగా, ఈరెంటికి నడితరమువాఁడుగా అగుట కాలప్రభావముననే; ధర్మాత్మునిగా, వికల మయిన మనోవృత్తి, గలవానిగా, ఈ రెంటికి మధ్యస్థునిగా నరుని మార్చు నదియు కాలమహిమయే. పంచజమని,-ఈ విధమున త్రిప్పట బెట్టునది, అతని ప్రవర్తనమో, కర్మమో, మతేదియో, ఊహించి దాని మూలకారణమును నిర్ణ యింపఁ గలవారెవ్వరును లేరు కాని లోకమును భ్రమింపజేయు నట్టిరూపహీన మయిన కాలముయొక్క నిరంతర నిర్వి రామ చేష్టాబలమే ఎందును ప్రత్యక్షమగు చున్నది.

ఇట్లు మాయామహాత్వము నుపదే శించిన గరుడధ్వజుని మాటలకు అబ్బుర మంది, శతానందుని నందనుఁడు:-"స్వామీ! మీరు చెప్పిన మహత్తరాం శములన్నియు ఆదరింపఁదగినవే. కాని మీచేఁ బొగడ్తగన్న ఆమాయ ఎట్టిది? దానిబలము ఏపాటిది? దానిరూప మెటు వంటిది? అది నివసించు చోటేది? దాని కాధారమెయ్యది? - వివరించి, నాకు ఏ తద్దర్శన భాగ్యము కరుణమెయి గలిగింప వేఁడికొందు" అని యనుటయు శ్రీహరి వీణామునితో నిట్లు వచించె.

"ఆమాయ త్రిగుణాత్మక, నిఖిలాధార సర్వజ్ఞ; సర్వసమ్మత; అజేయ, అనేక రూప. అది వ్యాపింపని చోటించుకేని కానఁబడదు. విధాతృపుత్రా! నీకు దాని జూడవలయునను కోరికగలదేని ఇపుడ బయలు వెడలి పోవుదము సన్నద్ధుడవయి రమ్ము. ఇప్పుడ ఆమాయాసందర్శనము చేయింతును. కాని, దానిఁ గాంచివగపు నెందకూడదు సుమా!" అని ముకుం దుఁడు ఖగపతిని డెందమున స్మరించెను. స్మరించుటయే తడవుగఁ బ్రత్యక్షమయిన గరుఁడనిఁ దానును గలబోజనుఁడు నెక్కిరి. వెంటనే నభోమార్గమున కెగసి, యాపక్షిం

ద్రుడు వాయువేగమునఁ బయనింప సాగెను. అనేకనగరములు, అరణ్యప్రదేశములు, వాహినులు, పర్వతములు ఋషులయాశ్రమభూములు సరస్సులు - క్రమంబుగఁ గడచి, యాతఁడొకనొకదేశముంజొచ్చెను.

అయ్యది కాన్యకుబ్జమనుపురము దానికిఁ జేరువ ఒకానొక పెద్దసరోవరము కనంబడెను. అందుఁ బ్రఫుల్లములగు తామరలు, పెక్కువిధములగు వన్నెచిన్నెలతోఁ గూయుచున్నట్టి పక్షులు గనుల పండువొనర్చుచుండెను. స్వచ్ఛ శీతలాంబువుల కెరటములతో అలరారుచుండెను. ఒడ్లయందు వృక్షలతాగుల్మములుభాసించుచుండెను. అట్టియెడ మాధవుఁడామునితో:- "నారదా! కలువలచే ఆవరింపఁబడి, బెగ్గురుల కలకలారావములతో అందగించుచు విమల జలములతో ఒప్పారు ఈ తటాక మెంత రమణీయముగ నున్నది!"- అని పలుకుచు చిఱునగవు తొలుకాడు మోముతో, ఆ సంయమివరేణ్యుని చిటికెన వ్రేలిం బట్టికొని చల్లని చెట్లనీడగల దానితీరమున దిగి, ఆసరస్సువంకఁ జూచుచు అతనితో ఇట్లు నుడివెను:-'సాధుజనుల హృదయమువలె, ఈ చెఱువులోని నీరు స్వచ్ఛమయి తామరలలోని పుప్పొడుల సంపర్కమువలనఁ బరిమళవంతమయి, ఇంపుసొంపు నింపుచున్నది. ఇందుస్నానము కావించి, తరువాత కాన్యకుబ్జపట్టణమును జూడఁబోవుదము. తొలుదొల్త నీవు ఇందు దిగి స్నానము చేయుము. వెంటనే నేనును చేయుదును."

నారదుఁడది విని మిక్కిలి సంతోషముతో, తన వీణియను జింకచర్మమును ఒక చోటఁ బెట్టి నదియొడ్డునకు జని, కాలుసేతులు గడిగికొని, సిగ ముడివేసికొని దర్భలు చేఁబూని, ముమ్మారాచమన మొనర్చి మొలబంటినీట దిగి నిలిచి, స్నానము చేయఁదొడఁగెను.

శ్రీహరి చూచుచుండఁగనే, రెండు మూఁడుమునుకలు వైచి లేచిన నారదుని పురుషరూపమదృశ్యమై, స్త్రీజనోచితములగు నానావిధ భూషణములతో నొప్పారు నారీత్వము సిద్ధించెను. అంతలో వెన్నుఁడును ఒడ్డుననున్న మౌనిశ్రేష్ఠుని కృష్ణాజినమును, వీణియను దీసికొని గరుడు నెక్కి యొక్కక్షణమునఁ దన వైకుంఠ ధామమున కరిగెను. నారదుఁడును దీరముంజేరి తన యేణచర్మము, వీణెయు, నారాయణమూర్తియు స్మృతిపథమునకు దూరగులగుట, నేమియుఁదోఁపక నలుదెసలకు దృష్టులు బరపుచు నిలుచుండెను.

అట్టియెడఁ గాన్యకుబ్జాధీశుఁడగు తాళధ్వజమహారాజు రథగజపదంతులతో, ఆదారి నేఁగుచుస్త్రీరూపమందిన నారదుఁడున్న దెసకు వచ్చి, యావనితా శరీరధారిని ఱెప్పవ్రాల్పక కనుంగొని:-'యువతీమణీ! నీవు మానవమానినివా? దేవాప్సరసవా? నాగకన్యారత్నమవా? కిన్నరమదిరాక్షివా? ఇయ్యెడ నీవు ఒంటరిగ వసింపఁ గారణమేమి? పసిదానవు; ఎలప్రాయమున నున్నదానవు. నినుఁగనినప్పటి నుండి నామది చలించినది ప్రేమవలపునకు నిలయమయినది రమణీతిలకమా! నీకింకను బరిణయము కాలేదుగదా! ఏల ఈ సరస్తీరమున నటమటించెదవు? నీ పయి మరులు

గొన్న నన్నువల్లభునిగ నంగీకరించి సమస్త సుఖము లనుభవింపుము. అనాదర మొనరింపకుము''—అని వచించెను. అపు డా కోమలాంగి లజ్జించుచుఁ జెఱునగవున నిట్లనెను:-''నీచిత్తమెట్లో యట్లే యొనర్పుము. న్యాయప్రకార మర్ధాంగి నెట్లు చూడఁదగునో యట్లు చూడుము''— అనుటయు, నతఁడు ఆయబలకయి యొకశిబిక నాయత్త పఱుపుఁడని తన పరివారజనమున కాజ్ఞాపించెను. వెంటనే మృదువులగు పరుపులు దిండ్లును, బట్టుగుడ్డల తెఱలును ముత్యాల జాలరులును, బంగారు పూతలును గలిగి నలువురు మోయఁదగినదగు అందమయిన పల్లకిని గొందఱు భృత్యులు దెచ్చిరి. దాని నాలలనాశిరోరత్నము అధిరోహించి యానృపాలునివెంట నాతని పురమున కరిగి, యొకానొక శుభముహూర్తమున నాభూపాలునిఁ బెండ్లాడి ''సౌభాగ్యసుందరి'' ''యను పేరఁ దన మనోహరునికిఁ బ్రాణపదయై సర్వవైభవములు విలసిల్ల సుఖములు అనుభవించుచుండెను.

అమ్మాయా ప్రభావ మెట్టిదో కాని, తాను బ్రహ్మజ్ఞాని యని గాని, పుంభావ సమన్వితుఁడనని గాని దేవర్షికినిసుమంతేని స్మృతికి రాదయ్యె. పైఁగా ''నేను పట్టమహిషిని. ఇందుల్లసిల్లునవెల్ల నా సొమ్మే. నాకు సాటిరాఁదగు సుందరు లీలోకము ననేకాక, యేలోకముననను నుండరు'' - అని గర్వమున మిన్నుమన్ను గానకుండెను.

ఇట్లు పండ్రెండేండ్లు కామక్రీడావిహారాదులతోఁ దాళధ్వజునకు నాతని దారకుఁ గడచనియెను. అంతె నామె గర్భము దాల్ప రాజపుంగవుఁ డామె కోరినవెల్ల నెఱవేర్చుచు మిక్కిలి ప్రేమతోఁ జూచుకొనుచుండెను. నెలలు నిండఁగనే యాకాంతాతిలక మొక మగశిశువుం బ్రసవించెను. రాజును బ్రజలును మహోత్సాహముతో నుత్సవములు చేసికొనిరి. భూపాలకుఁడాతనూజునకు వీరవర్మ యని నామకరణము గావించెను. మరల రెండేండ్ల కామె మరొక కొడుకుం గనియె. అతనికి ప్రభువు సుధన్వుఁడని పేరిడియె. క్రమక్రమముగ ఇట్లు పండ్రెండుగురు సుతులు, ఆరాడ్దంపతుల కుదయించిరి. వారినెల్లరఁ బెంచి, పెద్దవారినిజేసి, విద్యలలవఱచి వివాహాదులొనర్చిరి.

ఆ రాజదంపతులు తమ గార్హస్థ్యము సఫలమయినందులకు సంతసించుచు వానప్రస్థాశ్రమము స్వీకరింపనుండ, గొడుకులు, కోడండ్రు, ఆ కొడుకుల కొడుకులు, వారి కులకాంతలు ఏర్పడుటచే సంసారపు గొడవలును మిక్కుటములైనవి. విస్తరించిన కుటుంబములోని యిక్కట్లు వృద్ధులైన రాజదంపతులకుఁ దీర్పరానివై తలమునుకలుగఁ బరిణమించినవి. కొడుకుల మనుమల సంసారములలో - ఒకచోట సంపద, ఒకచోట ఆపద, ఒకచోట సుఖములు, ఒకచోట దుఃఖములు, ఒకచోట వ్యాధులు, ఒకచోట నీరోగములు - ఒకటి గాదు, రెండుగావు - అన్నియు బెడదలుగ నేర్పడినవి. దీనికిఁదోడు వారిలోఁ గలహములు చెలరేగినపుడు - తీర్చుటయన్న సామాన్యకార్యము గాదు.

స్త్రీత్వమలవడిన సురమౌని, లోలోన ధనసంతాన సంపదను మురిసిపోవుచు ''నా పుత్రులు, పౌత్రులు మహాబల

వంతులు, వారి యిల్లాండ్రన్ననో - ఉత్తమ కుల సంజాతలు. నా కలిమి కేపడుకల కలిమియు సాటిగాదు'' - అని యుప్పొంగుచుండెను. కాని తాను నారదుఁడననియు మాధవుఁడట్లు తన్నుఁ జేసెననియు మనస్సున నెంచఁజాలని మాయావాగురలోఁ బడిపోయెను.

ఇది యిట్లుండ శత్రుమహీపతి యొకడపారబలముతో దండెత్తివచ్చి కన్యాకుబ్జమును ముట్టడించుట దెలిసి తాళధ్వజేంద్రుఁడు పుత్రపౌత్రులతోను సేనలతోను దరలిపోయి యా వైరిభూపు మార్కొనెను. యుద్ధము తుములముగ జరిగెను. అందు తాళధ్వజుని సంతాన మెల్ల విధ్వంసము కాఁగాఁ, జేయునది లేక మహాదుఃఖముతో నతఁడు రాజప్రాసాదము చేరి, సౌభాగ్యసుందరికి రణప్రకారమును దాని పరిణామము నెఱింగించెను.

శోకాకులచిత్త యగు పట్టమహిషి యపుడు పొలికలని కేగి నేలఁ గూలి యున్న తనయులను మనుమలను జూచి మూర్ఛిల్లి, తెప్పరిల్లి విలపించుచుండెను. ఆ యదనున మధుసూదనుఁడు వృద్ధబ్రాహ్మణాకారముతోఁ బ్రత్యక్షమై ''వెలఁదీ! ఏల దుఃఖించెదవు? వీరిని కుమారులని భావించుట కేవలము భ్రమయే. తొలుత నీవెవ్వరవు? వీరికిని నీకును సంబంధ మేమున్నది? - కాలవశమున బాంధవ్యము లేర్పడుటయుఁ దొలఁగుటయు సహజములని తెలిసికొనుము. ఏడ్చినంతనే చచ్చినవారు లేచి వత్తురా? కాన, విచారముమాని, స్నానమొనర్చి వచ్చి - నివాపము లిమ్ము. శ్మశానము ద్రొక్కి వచ్చిన వారెవ్వరు ఇంట స్నానము చేయరాదు. కాన బంధుసహితముగ నాతోడ రమ్ము'' - అని పలికి, వారిని వెంటనిడుకొని ''పుంతీర్థ'' - మను సరస్సుకడ కరిగెను. వనితారూపుఁడగు నారదుఁ డాకొలనున స్నానమొనర్చి పైకి లేవఁగనే పురుషాకారము అలవడెను. ఆశ్చర్యపడుచు గట్టునకుఁ జేరికొనునంతకు, అతని కృష్ణాజినమును వీణను బూని యున్న కమలాక్షుఁడు గానవచ్చెను. తక్షణము తాను నారదుఁడననియు, నచ్యుతుడే తన్నట్లు తన్వంగిగాఁ జేసెననియుఁ దనలో ననుకొనుచుండ ''నారదా! ఆలసింపకుము త్వరితముగ రమ్ము!'' - అను కేశవుని పిలుపు చెవునిబడఁగనే, ఆ స్మృతికిఁ దగిలిన నవలారూపవిషయము పూర్తిగ మఱపొందెను.

రాజదియెల్లఁ గనుంగొని, చచ్చిన సంతానము కొఱకును, నదృశ్యమైన కళత్రము కొఱకును వగలఁ బొగులుచుండ రమానాథుఁ డాతని నోదార్చి, వైరాగ్యము గలిగించి స్వస్థానముం జేరనరిగెను. నారదున కప్పటినుండి మాయ దుర్జయ స్వభావము గలదని యనుభవపూర్వకముగఁ దెలిసివచ్చెను.

''భూనాథ దేహి మాయా
ధీనతఁ బరతంత్రుఁడగుచుఁ దిరుగున్ సంధీ
తై నెగడెడి పరతత్త్వం
బే నెల వమ్మాయ కనుచు నెఱుఁగుము పేర్మిన్''

——(०)——

# కామాయని

మూలం :

శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :

శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గత సంచిక తరువాయి)

అడ్డగించుటకు నా కధికారమున్నది.

ఇడ:_పుణ్యవతీ, నేను నీ సౌభాగ్యమును ధ్వంస మొనర్చిన యధమురాలను. అందువలననే దేవీ మరల మరల నిన్ను ప్రార్థించుచున్నాను. నన్ను క్షమింపుము !

శ్రద్ధ:“ఇడా, నీ వింతవరకును శిరమునైపై కూర్చుంటివే గాని హృదయమున ప్రవేశింపనేలేదు: నీ వాకర్షణల స్వరూపవై జీవన నాటకమును మాత్రమాడుచు సత్యసౌఖ్యదాయకమైన యను భూతులను కోల్పోయితివి. సత్యజ్ఞానముల ప్రకాశరేఖ నీ దరిజేరనైనలేదు. ఇడా! నీ ముఖముద్రనా నుండి దేనినో వాంఛించుచున్నట్లు గోచరించుచున్నది. అగుచో, నా జీవనరత్న కోశమును నీ కందించుచున్నాను.” అనుచు ఇడకు కుమారు నందించెను. “మీ రిరువురుకలసి రాజ్యాంగము నిర్మించి, పరిపాలనను నిర్వహింపుడు. కాని, ఒక్క మాట, శాసకులైన పిదప మాత్రము, మీ రాజ్యమును భయభీత మొనర్పవలదు సుమా!” అనుచుండగా కుమారుడు తల్లికేసి వ్యాకుల స్వాంతుడై ప్రశ్నించుచున్నట్లు చూచెను. అతనికి శ్రద్ధ ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. “నాయనా, ఇడా, తన ప్రేమతో, నీ సర్వబాధలను హరింపజేయును. ఆమె తర్కమయి. నీవు శ్రద్ధామయుడవు. ఇరువురుకలసి ‘సమరస’తను ప్రచార మొనర్చుడు. అప్పుడే మానవతకు సౌభాగ్యము చేకూరును. నాయనా, తల్లిని - నా మాట వినుము సుమా” అనుచు శ్రద్ధ మనువు నన్వేషించుటకై వారినివీడి పయనమయ్యెను. కుమారుడును (మానవుడు) ఇడయును సారస్వత నగరమునకు మరలిరి. శ్రద్ధ వెదకుచు పోయి, పోయి, సరస్వతీ తటమున నొక గుహలో మనువును కనుగొనెను. ఆమె చెంత కుమారుడు లేకుండుటచూచి, బిడ్డ డేమయ్యెనని మనువు ప్రశ్నించెను. కుమారుని ఇడకిచ్చివైచితినని శ్రద్ధ తెలుపగనే మను విట్లనెను.

మనువు:-“శ్రద్ధా! నీ హృదయమున, నెవ్వరిపైనను పరిపూర్ణప్రేమలేదా? నా కత్యంత ప్రీతికరుడగు కుమారునికూడ, ఎవతెనుండి నా ప్రాణములను రక్షించుకొని బైటపడితినో ఆమె కిచ్చితివి! ఎంత కఠోరమైనది నీ హృదయము!”

శ్రద్ధ:-“ప్రియతమా! లోకమున ఇచ్చినవారెవ్వరును నిర్ధనులు కాజాలరు! దారిద్ర్యము వారి దరిజేరదు. జీవనరహస్యమంతయు నీ యిచ్చిపుచ్చుకొనుటలోననేకదా ఇమిడి యున్నది? అందువలననే కుమారుని ఇడ కొసగితిని!”

మను:- దేవీ, నీ వెంతటి యుదారమూర్తివి! నిర్వికార మాతృమూర్తివైన నిన్ను ‘నారి’ యని తలచిన లఘు బుద్ధిని నేను. శ్రద్ధా, నా యల్పత్వమును సరకుగొనక - ఒక్కసారి పశ్చాత్తాపపశరముచే విదీర్ణమై ఖేదమందుచున్న నా హృదయము నొక్కపరి పరికింపుము!

మాటాడుచున్నంతనే మనువు ఘటాలోపాంధకారమున మనువున కొక జ్యోతి, నిజప్రకాశమును నలుగడల వ్యాప్తమొనర్చుచు గోచరించెను. ఆ జ్యోతి యానందనర్తన మొనర్చు నటరాజను మహాదేవునిది. నటరాజ శంకరుని యానంద నర్తనమును కూడ నాప్రకాశమునందు చూచి ముగ్ధుడై మను విట్లనెను. “శ్రద్ధా, నీవు నా కొకింత సాయమొనర్చి, నన్నా మహాజ్యోతికడకు కొనిపొమ్ము! నా మిథ్యాజ్ఞాన ధ్వాంత మా మహాజ్యోతి కాంతులలో పటాపంచలగును. దయామయీ, సదా ఏకస్వరూపిణి అఖండ సత్యానంద స్వరూపిణివైన ఆ మహాజ్యోతికడకు మరే యాలస్యమును చేయక త్వరితముగ కొనిపొమ్ము!”

## 14 రహస్యము

మనుని యాదేశము ననుసరించి శ్రద్ధ యాతనికి నటరాజమహాదేవుని దర్శనమొనరించుటకై పథప్రదర్శికయై పురోగమించుచుండెను.

(సశేషము)

# స్వప్నంలో స్వర్ణ

శ్రీ ఎస్. ఎమ్. వాద్రేవ్

ఆరుగంటలయింది!

ఆనందంతో ఆనందరావు కంపెనీ హాల్లోంచి బయటకువచ్చి, మెయిన్ రోడ్డెక్కాడు. ఎవ్వరూ చూడకుండా భార్య స్వర్ణకు నాలుగణాల గులాబీ పువ్వులు కొన్నాడు. స్నేహబృందంలో వారెవ్వరూకూడ కనబడకుండా ఉండాలని సాధ్యమైనంత త్వరలోనే యింటిని చేరుకున్నాడు. చెల్లెలు ఎదురయి, "అన్నయ్యా! పువ్వులు తెచ్చావా?" అంది. నేను స్వర్ణకు సంతోషంతో యిద్దామంటే చెల్లెలు అడుగుతుందా? అని గుడ్లురిమిచూశాడు. పాపం! అమాయకురాలు తల్లిదగ్గరకు వెళ్ళిపోయింది. తనకు స్వర్ణ ఎదురయి సంతోషంతో స్వాగతం చెబుతుందనుకున్నాడు. అలా జరగలేదు.

స్వర్ణజాడ లెక్కడా కనబడక తల్లి దగ్గరకువెళ్ళి అడిగాడు. తల్లి రుసరుసలాడుతూ "ఏం! అలా అడుగుతావ్! చెల్లెలు అడిగిన దానికి సమాధానం చెప్పలేదూ - స్వర్ణ ఏదీ? అని అడగటానికి నీ నోరెట్లా వచ్చింది? బయటుంది, మూడు రోజులదాకా పనితప్పదు. కోడళ్లవచ్చినా యింతే! రాకపోయినా యింతే! ఆ మాత్రం అడిగిందనేనా ఈకుండా అలా గుడ్లెఱ్ఱచేసావ్!" కొడుకూ కూతుళ్ల సంభాషణలువిని కొడుకుని దులిపేసింది.

ఆనందరావుకి దూర్వాసుడికి వచ్చినంత కోపం వచ్చింది. చేతిలోనున్న పొట్లం వంటింట్లోకి గిరవాటెట్టాడు. గదిలోకి వెళ్ళిపోయాడు. స్వర్ణతోకలసి సరదాగా ఎగ్జిబిషన్కు వెళదామని ఆఫీసువర్కు త్వరగా పూర్తిచేసివచ్చాడు. ఆ కుతూహలమంతా అణగారిపోయింది. తన హృదయం ఎంతగా బాధపడుతోందో ఎవరికితెలుసు? ఎవరితో చెప్తాడు? భార్యతోనే చెప్పాలి - ఎలాగు! తల్లి సరే సరి.

"ఓరే! ఆనంద్రం. చెల్లాయికి ఎగ్జిబిషను చూపించరాదూ?" తల్లి అంది. "దానికి నీళ్లయ్యాక అందరం వెళ్లచ్చులే" ఆనందరావు ముక్తసరిగా జవాబిచ్చాడు.

స్వర్ణ ఆ రాత్రి తన దగ్గర లేకపోవడం చాల నగుబాటుగావుంది ఆనందరావుకి. అన్నం దగ్గర మొహమాటం లేకుండ భార్యకు సంజ్ఞలద్వారా తెలిపి తనకు కావలసినవి వేయించుకుని తినేవాడు. ఈ మూడు రోజులు తల్లి కూడు తినాలని బాధపడ్డాడు. కూర కావాలంటే కళ్ళతో చెప్పేవాడు. అది అర్థంచేసుకుని స్వర్ణ వడ్డించేది. తల్లిని యిది కావాలి; అది కావాలి అని అడిగి మరీ వేయించుకోవాలి. మజ్జిగ మొన్ననే వచ్చిన కొత్త గోదావరి నీళ్లు. స్వర్ణ బంగాళా దుంపల కూర వండేది - ఎంత రుచిగా వుంటుంది! మా అమ్మ వండిందీ - మాడ్చేసి వేయించిన అరటికాయ ముక్కలు. స్వర్ణ చేత్తో వండిన వంట చాల బాగుంటుంది. ఆ నాడు పండగే! ఎలాగయితేనేం ఆ పూట అయిందనిపించాడు. రాత్రి భోజనానికి రమ్మంటే కడుపునొప్పి అని వంక

పెట్టి ఆ మూడూ రోజులూ అయ్యరు హోటలుకు రోజుకి రెండు రూపాయలు చెల్లించాడు. హోటల్లో ఇంతకన్న బాగుంటుందన్నమాట అతనికి. మూడురోజులు ఆనందానికి నరకప్రాప్తి లభించింది.

స్వర్ణకు నగలులేవు, చేయించాలి, తెచ్చే నూటపది రూపాయలు తిండికే చాలుతుంటే నగలెలావస్తాయి? పైగా తల్లి, చెల్లెలు మేస్తున్నారాయె తన ఆదాయంలో, ఏపార్టీకైనా వెడితే ఒక మంచి బెంగుళూర్ సిల్కుచీరయినాలేదు. కొనాలి. కొద్దిగా సంగీతం వచ్చునంది. మా ఆఫీసు ఢిల్లీమారితే పెద్ద యిల్లు రెంటుకి తీసుకొని చుట్టూ పెద్ద పార్కులాగా వేయించాలి. ఒక స్టుడీబేకర్ కొనాలి. స్వర్ణకు మంచి ఫేషన్స్ నేర్పాలి– కొద్దిగా చదువుకున్నానంది ఫరవాలేదు. ఆ మాత్రం వచ్చినవాళ్లు కూడా లేరు. యిలా ఇంకా అనుకుంటూ ఆనందంగా ఆనందరావు కళ్లకి విశ్రాంతి నిచ్చాడు.

క్రింద పెద్ద గదిలోంచి ఏవో పిచ్చి అరపులు వినబడ్డాయి. ఆ అరపులకు హడలిపోయి 'స్వర్ణ ... స్వర్ణా ... స్వ ... ర్ణ ...'' అంటూ మంచంమీాద నుంచి క్రిందకు దొర్లిపడ్డాడు. భార్య స్వర్ణకు ఆపదేమయినా వచ్చిందేమోనని. ప్రక్కనే పడుకున్న తల్లి, చెల్లెలు లేచారు. క్రిందపడిన ఆనందరావుని కూర్చోబెట్టింది తల్లి.

''ఏరా! ఆనందం! ఏంకలవచ్చిందిరా. మంచంనుంచిపడ్డావు'' ఆదుర్దాతో తల్లి అడిగింది.

''స్వర్ణ ఎవరన్నయ్యా! ఓహో రాబోయేవదినమ్మగారా! ఇంకా ముహూర్తం చాలరోజులుంది – ఓపికపట్టు'' చెల్లెలు నవ్వుతూ అంది.

''యింతసేపటినుండి జరిగిన రభసంతా కలన్నమాట'' అని అనుకుని నవ్వుతూ దంతధావనానికి లేచాడు.



## శ్రీమతి కానుమిల్లి వెంకట నరసమ్మగారి భూరివిరాళము

పశ్చిమ గోదావరిజిల్లా కొయ్యలగూడెంలో శ్రీమతి కానుమిల్లి వెంకటనరసమ్మగారి పదివేల రూపాయల విరాళముతో కీడింగుమిషన్ హాస్పిటలులో నిర్మించబడిన శ్రీ గెడా గెరటయ్య మెడికల్ వార్డు 7_4_59 న దివాన్‌బహదూరు బండి శ్రీహరిరావునాయుడుగారి అధ్యక్షతన ఆవిష్కరించబడెను. పలువురు పెద్దలు ఉత్సవములో పాల్గొనిరి. శ్రీమతి వెంకట నరసమ్మ తల్లిదండ్రులపేరిట అక్కగారి పేరిట చేసినదానములు కీర్తించబడి ఆమె అభినందించబడిరి. అధ్యక్షులు శ్రీ శ్రీహరిరావునాయుడుగారు ఆమె విద్యాసౌకర్యములకొరకు, వైద్యసహాయవసతులకొరకు యింతవరకు లక్ష యాభైవేల రూపాయలను విరాళముల నిచ్చిరనియు, శ్రీ గెడాగెరటయ్య బోర్డు హైస్కూలుయొక్క హరిజన హాస్టలుకు సాలీనా ఖర్చులకుగాను 15 యకరముల భూవసతిని కన్నాపురములోను, అచ్చటనే ప్రభుత్వము స్థాపింపబోవు సర్వీస్‌హోముకు 13 యకరముల భూవసతిని కల్పించిరని వివరించిరి.




శ్రీ డి. బాబన్న

ఆ స్వతంత్ర స్వర్గమునకు - మేలుకో - భారతీయుడా!
ఈ వికారి వత్సరమున - ఇంపు సొంపు గులుకుచుండ

దైన్య జడతలేని - మనో ధైర్య స్థైర్య సహితమైన
నిశ్చలత్వ మందినీవు - నిక్కినడచు శివిగల్గి ॥

సత్య ధర్మ మహింసా - శాంతి దాంతు లొల్కునట్టి
నిత్యమా ప్రభుత్వరీతి నెగడుగా - వికారిలోన ॥

దేశ పిత మహాత్మ గాంధి - తెలిపినట్టి విశ్వప్రేమ
దేశ దేశములను నెగడి, - తేజరిల్లు - వికారిలోన ॥

భారత త్రిమూర్తులరయ - గాంధి, టాగూరు, అరవిందులూ
వారి వేద సత్యఘోష నీ "వికారి"లో వెలయుగా ॥

ఆటం బాంబు లలజడిని ఆత్మబల్మి సణగద్రొక్కి
"పంచశీల" జండా నూత్న వత్సరమున వెలయుగా ॥

ఈ "వికారి" వత్సరమున నే వికారములు లేక
పాడి పంటలెల్ల భోగభాగ్యములు జేకూరుగా ॥

# వికారి

శ్రీ దేశిరాజు భారతీదేవి



సగుణ బ్రహ్మము నీ మహా మహిమచే, సంజాతమైయుండు నీ
జగతీ చక్రముగల్గె నీ వలననే, సర్వంబు నీ కార్యమే
యగు, గాదే; నిను దప్పఁగోఁగలుగు బ్రహ్మంబొండు మాత్రంబె. ని
త్యగుడౌనేమో; వికార శూన్యతను బెంపారఁగ "వికారీ!" నమః
అరయ వికారముం బొరయనట్టి పదార్థము లీజగంబునఁ
బరగునె! నేడుగాదె నే"డుగాది" యనవచ్చును ముచ్చటదీర ధాత్రిపై,
నరులొక పేరుబెట్టుకొని, నవ్యతగూర్చుచు నీ ముఖంబునఁ
మురిపెము గన్నులారగని మోదముగాంతు రపారభక్తిమై.

గగనాది భూతవికార శక్తిఁ జేసి - పూవుల మొలకలు బుట్టునంచు
పికశుకాదులదోచు, భిన్నస్వనంబులు - గాఢవికారాన గలుగుననుచు
ఋతువులలోభేద, గతుల చిన్నెలు వన్నె-యలు వికారముననే గలుగుననుచు
వివిధమానవజంతు విసరంబుద్ధి భే - దంబు వికారానదనరు ననుచు
తెలుపగా "నుగాది"ని ముందు, నిలిపికొనుచు
వచ్చితే "వికారి" వాసంత, వాసరముల
శుభవికారి నటంచును, జూపగోరి
ధారుణీ ప్రాణులెల్లని, న్దేరిచూడ

కలిగె వికారమెల్లెడ జగంబున, నిత్యపురోభివృద్ధికై
గలుగు ప్రతిక్షణంబును వికారము, మొక్కలు చెట్లులౌట,
మొగ్గలు సుమనోవికాసమును గాంచుటయెల్ల వికారమే గదా!
తలకగనేల పేరువిన, ధైర్యమువీడి "వికారి" వత్సరా!

శుభవికార పరంపర, సొంపుతోడ - భారతప్రజలభివృద్ధిబడసి, యర్థ
ధర్మ, కామ, సిద్ధినిగాంచి ధరణి నీ "యుగాది" మొదలు మహోన్నతి నంద్రు
గాత!



# సంపాదకీయములు

## వివాహితులగు స్త్రీలకు నర్సింగువృత్తి

మద్రాసు ప్రభుత్వము వివాహితులగు స్త్రీలకు సయితము నర్సింగువృత్తి సౌకర్యాలు కలుగచేయడానికి ఉద్దేశించుట హర్షించతగిన విషయము.

ఇంతవరకు నర్సింగ్ వృత్తి స్వీకరించుటకు అవివాహితలే అర్హులుగానుండిరి. నూతన ప్రాతిపదిక ననుసరించి వివాహితలు సయితము శిక్షణపొంది నర్సింగ్‌ను వృత్తిగా స్వీకరించి పగలు 5 గంటలు మాత్రము నిర్వహించుటకు అవకాశము కల్గించుటవలన వైద్యాలయములలో చాలినంతమంది నర్సులు లేనికొరత తీరుటయేకాక అనేకమంది మహిళలకు జీవనము కల్పించినట్లు కాగలదు.

రాష్ట్రంలో మరిన్ని ఆరోగ్యకేంద్రాలను, పట్టణములలోను, పల్లెలలోను తెరచి వైద్యసౌకర్యాలను విస్తృతంచేయనున్న సందర్భమున నర్సింగ్ వృత్తి విశేషంగా స్త్రీలనాకర్షించవలసియున్నది. వివాహితలగు స్త్రీలు సయితము యీ సదవకాశమును వినియోగించుకొని జీవనోపాధితోబాటు మానవసేవకు సయితము ముందంజవేయుగలరని ఆశిద్దాం.

—X—

## శ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారి షష్టిపూర్తి సన్మానము

ఈ విషయమయి, ఇదివఱలో ఒకటిరెండు పత్రికలలో, మిత్రులు శ్రీ బూదూరు రామానుజులురెడ్డి మున్నగువారు సూచించియుండిరి. మదరాసులోని శ్రీ శర్మగారి మిత్రబృందము కడచిన జూన్ మాసముననే వారిని తగురీతిని సన్మానించిరని తెలియుచున్నది.

ఇటీవల రాజంపేటలోని సుప్రసిద్ధ న్యాయవాదులును, ఆంధ్రవాణిపత్రికా సంపాదకులును అగు శ్రీ ఆకేపాటి చెంగల్రెడ్డి, ఎం. ఏ., బి. యల్. గారి యధ్యక్షతక్రింద ఒకసన్మానసంఘ మేర్పడి, పెద్దయెత్తున శ్రీ శర్మగారిని గౌరవింపఁ బనిసేయుచున్నట్లు వార్తలు వచ్చుచున్నవి. ఇది యావదాంధ్రము సంతసింపఁదగిన విషయము.

రాయలసీమలోఁ బుట్టి బండ్లకెత్తఁదగినన్ని గ్రంథములను రచించి ప్రకటించి తమ జీవితములు కేవలము భాషాదేవ్యారాధనముననే వినియోగించిన శ్రీ వావిలికొలను, జనమంచి మున్నగువారు ఇట్టిసన్మానములకు నోచుకొనకయే దివంగతులయిరి. ఇది వ్యక్తిగతదోషమో, స్థానగతదోషమో యయియుండును. ఇప్పుడేని శ్రీ శర్మగారి సర్వంకషపాండితికిఁ దగినట్లు గాకున్నను, యుక్తవిధమున ఆంధ్రులు శ్రీ శర్మగారి భాషాసేవను గుర్తింపవలసియున్నది. తదుచితముగ వారిని గౌరవించుటయు వారి విధ్యుక్తధర్మము.

ఉన్నత పాఠశాలాంధ్రోపాధ్యాయులయ్యు, అవకాశము ననుసరించి చేయు వారిసాహితీసేవ అనిర్వచనీయము. శ్రీ శర్మగారు విద్వత్కవులు; మంచి విమర్శకులు; పరిణతిచెందిన పరిశోధకులు. ఇంతవఱకు వారేఁబదికృతులవఱకు రచియించిరి. అందు 'శతకవాఙ్మయ సర్వస్వము' — వారి సర్వతోముఖవిజ్ఞానమునకు గీటురాయివంటిది. ఇంతకు అది తొలిసంపుటమే. రెండవసంపుటి, వారి యార్థికదౌర్బల్యవశమున వ్రాతప్రతిలోనే ఉండిపోయినది.

వీరి పూర్వులు శ్రుత్యాగమనిష్ణాతులు. గీర్వాణిభాషావిద్వత్కవులు, కార్వేటినగర రాజాస్థానప్రధాన పండితపదవీ విభ్రాజితులు. ఆహితాగ్నులు, అట్టివంశమున జన్మించిన శ్రీ శర్మగారి యుభయభాషా

ప్రావీణము స్తుత్యరము. వీరు గ్రంథకర్తలు మాత్రమేకాక 'ఆంధ్రవాణి' పత్రికాధిపతుల క్రిందఁ బనిచేసి, దాని సర్వతోముఖాభివృద్ధికి మిగుల కృషియొనర్చిరి. "మాతృసేవ" - యను 'శాయనాన్ సంస్థవారి వార పత్రికకుఁ జాలకాలము సహాయ సంపాదకత్వము వహించిరి. అందు వారు 'కౌశిక' సాంకేతిక నామముతో వ్రాసిన వారి వ్యాసరాజములమూల్యము లనఁదగును. ఇంతియగాక 'భారతి,' 'గృహలక్ష్మి,' 'ప్రకృతిమాత' మున్నగు పత్రికలలో నేటికి వారి వ్యాసములు గనఁబడుచున్నవి.

వీరి శిష్యవర్గమపారము. వారిచే శిక్షణబొందినవారిలోఁ బెక్కురు విద్వత్కవితాప్రావీణ్యమంది, కృతులు వెలయించినవారును గలరు. ఏకలవ్యభక్తితో వారింగొలిచి, వారియంతవారుగ విలసిల్లువారు. కడప, చిత్తూరు, నెల్లూరు, మదరాసులలో విస్తారముగనున్నారు. ఇంతటివారికి షష్టిపూర్తిసన్మానము చేయనెంచిన కడపమండలవాస్తవ్యులు ధన్యతములు. తెలుగునాట శ్రీ శర్మగారిపైన నభిమానముగలవారును, శిష్యవర్గమును, మిత్రగణమును శ్రీ ఆకేపాటి చెంగల్రెడ్డిగారి యాజమాన్యమున నేర్పడిన శ్రీవారి షష్టిపూర్తి సన్మాన సంఘమువారికి సర్వవిధములఁ దోడ్పడుట వారి కనీసపుధర్మమని విన్నవించుకొనుచున్నాఁడను.

ఆర్. వేంకట నరసింహులుసెట్టి.
తెలుగు పండితులు, రేణిగుంట
బోర్డు హైస్కూలు.

చిత్రసమీక్ష

—— (౦) ——

## శారదాఫిలిమ్స్‌వారి 'జయభేరి'

'జయభేరి' చిత్రము యీ నెల 2 వ తేదిన పత్రికాప్రతినిధులకు విజయాస్టూడియోస్‌లో ప్రదర్శించ బడింది.

ఇందలి కథలో సోదరులప్రేమ, బిడ్డవలెసాకి పెంచిన మరదిపట్ల వదిన వాత్సల్యం, త్యాగాలు, మతముపేరిట, కులంపేరిట జరిగే ఘోరాలు, సంకుచిత తత్వాలను ఎదుర్కొని విజేతగా జయభేరి మ్రోగించిన యువకుడు కడుసమర్థంగా, ప్రజానురంజకంగా చిత్రించబడినవి. ఉత్తమ ఆదర్శలక్ష్యాలను ప్రబోధించింది యీ చిత్రము.

కథ ఒడిదుడుకులు లేకుండా, సహజంగా నడిచింది. మాటలు, పాటలు చక్కగా నమరినవి. సంగీతము అత్యంతమనోజ్ఞంగానున్నది.

మంజుగా అంజలిదేవి, కాశీనాధశాస్త్రిగా నాగేశ్వరరావు, అన్నపూర్ణగా శాంతకుమారి ఉత్తమోత్తంగా నటించారు. రాజనర్తకిగా రాజసులోచన చక్కగా నటించింది.

శ్రీ గుమ్మడి, ముక్కామల, యస్. వి. రంగారావు మున్నగువారు పేరొందనతిగినట్లుగా నటించారు ఇందులో హాస్యము, నృత్య సన్నివేశములు పొందికగా నమరినవి.

అన్నివిధాల యీ చిత్రము ఉత్తమమయినది. ఇది యావత్ప్రజానీకమును రంజింప చేయగలదని గంటాపధంగా చెప్పవచ్చును.

ఈ చిత్రనిర్మాతలు శారదాఫిలిమ్స్‌వారు, దర్శకులు. శ్రీ పి. పుల్లయ్యగారు అభినందనీయులు.

—పున్నయ్య



Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15 Westcott Road, Royapettah, Madras. Ag. Editor: C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వి. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను.

రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.